ఓమ్

శివాయనమ

# భిల్లఫల్గునీయము

(నాటకము)









రచయిత

కఱ్ఱీ భీమలింగాచారి

# పీఠిక

పరమేశ్వరుండగు శివుని పంచవింశతిలీలలలోఁ బాండవమధ్యముఁ డయిన పార్థునిఁ బాశుపతాస్త్ర ప్రదానమునఁ గృతార్థునిఁగావించు సందర్భమున నా దేవదేవుఁడు వహించిన కిరాతవేషధారణము పదియేనవ లీలగా "సంకేత వెలయఁ గిరాతావతార । మెసఁగఁ దాల్చెడు పదియేనవలీల" యని పండితారాధ్య చరిత్రమున వాదప్రకరణములోఁ బాలకురికి సోమనాథ మహాకవి ప్రశంసించియున్నాఁడు. ఇందుఁ గూర్చిన కథ మహాభారతమున వన పర్వములో వర్ణింపఁబడియున్నది. దీని ననుసంధించియే గీర్వాణభాషలో "భారవేరర్థ గౌరవ" మ్మను ప్రఖ్యాతికిఁ దానకమయిన కిరాతార్జునీయ నామ మహాకావ్యమును భారవి మహాకవి రచించియున్నాఁడు. శ్రీనాథ కవిసార్వభౌముఁ డాంధ్రభాషలో రచించిన హరవిలాస ప్రబంధమునఁ గూడ నందు వర్ణితమయిన యీశ్వర విలాసములలో నొకటిగా నిది గ్రహింపఁబడినది. ఈ కథను తెలుంగుబాసలో దృశ్యరూపకముగఁ బరిరించు కవికృత్యములలోఁ జిరంజీవి కట్టి భీమలింగాచారిగారు రచించిన యీ భిల్లఫల్గునీయ మే ప్రాథమికము ప్రధానము నయియుండునని సంభావించుచున్నాను.

శ్రీకాకుళం జిల్లా నరసన్నపేట వాస్తవ్యుఁడు విశ్వబ్రాహ్మణ కులీనుఁడు నయిన యీ కవి "బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడు, ఉరుప్రజ్ఞా విశేషోదయాఽజిహ్మస్వాంతుఁడు ఈశ్వరార్చన కళాశీలుఁడు నగు శ్రీనాథ మహాకవివలెనే "చిన్నారి పొన్నారి చిఱుతకూకటి" నాఁటి నుండి సహృదయ హృదయంగమమగు కవితకూర్పనేర్చిన ప్రతిభావంతుఁడు శ్రీ మత్కామాక్షీ కృపాకటాక్షలబ్ధ సహజ కవితా విలాస' అని కవి యీ రూపకముయొక్క గద్యలోఁగూర్చికొనిన విశేషణ మీతని యెడ

యథార్థము నన్వర్థము కాఁదగునని యింతకు మున్ను ప్రకటితములయిన బసవ కళ్యాణాదిక కృతులే సమర్థింపఁగలవని తలంతును కవితాపథమున పిన్నవాఁడు శ్రీనాథుని యడుగు జాడలలోనె నడువ గమకించుట గమనార్హము

ప్రకృత రూపకము ఎ కవి తన యిరువది రెండవయేట రచించినట్లు నటీ సూత్రధారుల సంభాషణమువలన వ్యక్తమగుచున్నది నాటకాంతం హి సాహిత్య మ్మనెడు పెద్దల యాభాణకము కాని సహజ ప్రతిభాశాలురగు నిట్టి బాల యువ కవుల రూపకరచనము లీ యార్యోక్తికి నపవాదములు (Exceptions) కాఁగలవనియె నా విశ్వాసము ఈ నాటక రచనమునఁ గవి కొంతవఱకు సంస్కృత దశరూపక లక్షణములను మఱికొంతవఱకు అంక రంగ విభజనాదికములలో ఆంగ్ల నాటక లక్షణములను నాలంబించి నట్లు కనిపించుచున్నది మూలకథకుఁ గవి యందంద సముచితములయిన మార్పు లొనర్చియుండుట ముదావహము దివ్యాస్త్ర ప్రాప్తికయి యర్జునునిఁ దపశ్చరణమునకయి నియోగించుటకయిన యుపోద్ఘాతము ధర్మజునకుఁ గృష్ణ ద్వైపాయన మునివరునివలనఁ గావింపఁబడినట్లు మూలమందుండ నది శ్రీకృష్ణ భగవానుని వలననే యుపక్రమింపఁజేసి యందుకుఁ దగిన సన్నివేశమును ప్రథమాంకముననె పాండవేయుల యన్యోన్య సంభాషణములలో సముచితరీతిని గవి కల్పించి యుండుట ప్రశంసనీయము నాటకమాద్యంతము సరస మనోహర లలితరచనా విన్యాసములతో విభ్రాంతమయి హృద్యములగు గద్య పద్యములతోఁ బాఠకులకు శ్రవ్యరూపమునఁ గూడ నాహ్లాదకరము కాఁజాలియున్నది పాత్ర పోషణమా యా పాత్రల పరస్పర సంభాషణ కలనఁ జక్కఁగా నిర్వహింపఁబడినది కవిపూర్వ కృతులతో పాటీ రూపక కృతికూడఁ దేజస్వంతమగు భావ్యభ్యుదయముతో నీతఁ డితోధిక సరస రచనముల ముందింకను వెలయింపఁ గల్గు ననుటకు సూచకమగుచున్నది తినఁబోవు పదార్థముల రుచిని ముందుగానెంచి చూపుట న్యాయాభిమతము గాదు ఇందలి గుణగ్రహణమునకు విచక్షణులగు పాఠకోత్తములే ప్రమాణము

సహజ సరస కవితా విలాస విభాసియగు నిట్టి కవి జీవికకై జీవ రసమ్ము లింకించు రివెన్యూ డిపారుమెంటులో తాలూకా కచేరీ గుమస్తాగాఁ గుదిరియుండుట హాతవిధి విచిత్ర విధానములలో నొకటిగా గణింపనయి యున్నది నేను గూడ నీతనివలెనే యిట్టి కొలువుననే కుదిరి చిరకాల మందే జీవనము గడుపనవాఁడను మా యిరువురకుఁ గల సమానధర్మ మి యే దానిని బురస్కరించికొని యే కవియుఁ దన్మిత్రులు నేతత్పీఠికా రచనకయి వరణమొనర్చి నన్నాదేశించి యుందురని తలంతును ఇంతకు మించి యిందుకయి వాస్తవమైన యర్హత నాకులేదు నేనెట్టి రూపకములు రచియించిన వాఁడఁగాను

రివెన్యూ కొలువు నందలి పరిశ్రమ పరితాపాగ్నుల మూలమున నీ కవి కుమారుని లలిత కవితామృతధార లింకిపోకుండ మిత్రవర్యుల యాదరణ ప్రోత్సాహములనయము వలయుదోహద మొసంగి, తద్రక్ష కములయి వర్ధిల్లఁజేయుఁ గావుతమని యర్థించుచు జగజ్జనని శ్రీ కామాక్షీ మహాదేవి సర్వదా నిజ కృపాకటాక్షామృతధారలఁ గురిసి కవికి దీర్ఘాయు రారోగ్య సౌభాగ్యాభ్యుదయము లొసంగిమనుచుఁ గావు తమని ప్రార్థించు చున్నాను

కాకినాడ
23—7—58

ఇట్లు
భక్తజనవిబుధ విధేయుఁడు
సం॥ బండారు తమ్మయ్య
(విమర్శ కాగ్రేసర ఐతిహాసిక సామ్రాడాది బిరుద విభ్రాజితులు)

శ్రీ శివాయ గురవేనమః

# ఆశీర్వాదము

శ్రీ వర్ధమాన చంద్రులు కట్టి భీమలింగాచారిగారు రచించిన బిల్లఫల్గునీయమను దృశ్యకావ్యము సత్యానందమున జదివితిని కథ శివుడు పార్థునకు పాశుపతాస్త్ర మిచ్చుటకుముందు కిరాతవేషమునవచ్చి యర్జును ధైర్య సాహసముల బరిక్షించుటయు పార్థుడు దేవలోకమునకేగి యింద్రు నానతిని నివాతకవచాది రక్కసుల నుక్కడించుటయు దేవతలచే నస్త్రంబులు వడయుటయును జనసామాన్యమునకు బరిచితములే ఐనను ఈకృతియందు వింతచెలువును సంపాదించినది పద్యములు చిక్కని పదబంధము, ధారాళమైన శైలియు గలిగి సెలయేటి జారువలె జాలువారు చున్నవి సంభాషణ సందర్భమున మాటలుపొందిక గలిగి ముచ్చటగొలుపు చున్నవి చతుర్థాంకము మొదటనున్న విష్కంభము చతుర్థాంక ద్వితీయ రంగమునకు ముందు చేర్చిన మిక్కిలి యుచితముగా నుండెను ఊర్వశీ శాపవృత్తాంతము పాశుపతాస్త్ర ప్రాప్తిలోగాని, ఇతరాస్త్ర లాభములలోగాని యుప రింపక కామ్యక వనముననున్న పాండవులకు తద్వృత్తాంత పరిజ్ఞానమునకు మాత్రమే యుపకరించుచున్నది విష్కంభానంతరమందు రంగము మననాటక లక్షణముల ననుసరించి యంతర్నాటికగా గాదగును

విమర్శ కాగ్రేసరులు శ్రీ బండారు తమ్మయ్యగారు పీఠికలోనెల్ల విషయములును చర్చించి యుండగా నింకను

నేను చెప్పవలసిన దేమిగలదు సర్వధా వారి యభిప్రాయముతో నేకీభవించుచు నీ సహజకవియింకను నిట్టి కృతులను రచించి బాషాసేవ సేయునట్లు ఆకామాక్షీదేవి యనుగ్రహించును గాత

ఇట్లు
కవివాదరేఖువు
కట్టి సాంబమూర్తిశాస్త్రి

నరసన్నపేట,
6–10–58

# ప్రశంసాపత్రము

మిత్రతుల్యులగు శ్రీ కట్టి భీమలింగాచారిగార్కి–

ఆర్యా!

మీ భిల్లఫల్గునీయ నాటకము నటనటఁ జూచితిని నాటకమునకుఁ బ్రత్యక్షముగ సంబంధించిన కథా భాగము తృతీయాంకాంతర్గతమే యయ్యు నైదంకముల నాటకముగ రచింప ననువగు పూర్వాపర సన్నివేశములఁ గూర్చుకొనుటలో మీయత్నము బాగుగనే యున్నది సరసరసోచితగా సంభాషణలు గల్గి పూర్వనాటకరచనామార్గానుసారియైన యీ మీ కృతి

"మిత్ర సంఘము మెచ్చ చిత్ర పద్యములతో
"

నన్న పద్యమునఁ బ్రకటితమైన మీ కవితా సామర్థ్యమును

సర్వధా ధృవపఱచుచున్నది వ్యావహారిక భాషకున్న, ఏకాంకి కాది సంక్షిప్త రచనలకును నాదరణగల నేఁటి కాలమున గ్రాంథిక భాషలో నైదంకముల నాటకమును రచింపఁబూనిన మీ పూనిక ప్రశంసాపాత్రము నాటకోచిత కథావస్తుగ్రహణముననుు నిదియాకర్షకమే యగుచున్నది అలంకారవ్యాకరణాది శాస్త్రపరీక్షకుఁ గవితా కన్యను నిలువఁబెట్టుట యాఱవమహాపాతకముగ నెన్నఁబడు నీ దినములలో నవ్యానికి సంబంధించిన విషయములఁ దడవ నా కభిమతము కాదు అట్టియవసరము లేకుండగనే చాలవఱకు రచింపఁజాలిన మీబోంట్లయెడ నిట్టి శంకలకుఁదావుండదు సర్వధా యీ మీకృతి యాంధ్రనాటక వాఙ్మయమునఁదగు స్థానమాక్రమించి మీ ప్రయత్నమును సార్థక మొనర్చుగాత మని హృదయపూర్వకముగఁ గాంక్షించుచున్నాఁడను

ఇటు

భవదీయ శ్రేయోభిలాషి

సం॥ బి వి సూర్యనారాయణ M A

భాషాప్రవీణ

పర్లాకిమిడి కళాశాలాంధ్రోపన్యాసకులు

# సదాశయము



ఉ. హృద్యము, సర్వమాన్య రసికైకేనసమిద్ధవిశాలబుద్ధి సం
వేద్యము, సద్గురూ_క్తపద వీక్షణ గమ్యకవిత్వతత్త్వసం
పాద్యముదార ధీరత చమత్కృతసత్కృత గద్యపద్యసం
పద్య మహో! భవద్విమలవాఙ్మయ మార్యసమీడ్య
సత్కవీ!

కం. ఇల్లు చతుర్దశభువనం
బిల్లాలు పరాద్యశక్తి పృథుమహిమా సం
పల్లలితుఁడుకృతక
భిల్లుఁడు నినుఁబ్రోచుఁగాతఁబ్రేమన్సుమతీ

ఏలూరు
1—5—57

ఇట్లు,
చిదానందలహరీ, రసకోల్లాసాదిక గ్రంథకర్త
అద్దేపల్లి కుటుంబరావు

# అభిప్రాయము



చ సరళసమంజనాతి మృదు శబ్దపరితముఁ బ్రస్ఫుటార్థ బం
ధురమనవద్యహృద్యగుణ తోషితమైతగు బిల్లఫల్గునీ
యరుచిరనాటకోత్తమము నార్యులు మెచ్చ రచించితౌరసు
స్థిరముగ భీమలింగకవి శేఖర సద్ధిషణా దురంధరా!

చ మనములరించె నీకవిత మంజుల కల్ప సుమాసవంబు నా
నినగతిఁ దావి చందనము నిండనలందినమాడ్కిఁ గ్రమ్ముం
చిన విడె మబ్బుపోలికను జెప్పెడిదేమిఁక నీకు నీవెగా
కెనయగు వారలెవ్వరు మహీస్థలి నిప్పటిసత్కవీశ్వరుల్

ఇట్లు
భవదీయమిత్రుఁడు
నాపేటి సూరిలింగము దేవరకవి
తిలారు

# కృతిసమర్పణము

శా. శ్రీ పట్నాయక వంశవార్ధి విధుఁడై
శీతాంశురమ్యాస్యుఁడై
పాపారాయకుమారుఁడై గుణినుత
వ్యాపారుఁడై భూమిపై
నేపుంగాంచి విలాసియై దివములో
నింపొందు సంగాతికిన్
బాపద్వేషికి రామరావునకు శుం
భత్ప్రేమనర్పించెదన్

ఇట్లు,
గ్రంథకర్త

# మనవి

నేనీ నాటకమును సుమారు పదివత్సరముల క్రిందట నాయిరువదిరెండవయేట నాటకప్రదర్శనాభిలాషులగు మిత్రవర్యుల ప్రోత్సాహమున వ్రాసియుంటిని. తదుపరి జీవనాధారమునకై నేను రివెన్యూ డిపార్టుమెంటులో గుమాస్తాగాఁ జేరి గ్రామాంతరముల వసింపవలసివచ్చుటచేతను, ప్రోత్సాహకులగు మిత్రులుగూడ జీవికకై తలయొకదారి బట్టుటచేతను నీ నాటక మింతవఱకుఁ బ్రదర్శింపఁబడుటకుఁగాని ముద్రింపఁ బడుటకుఁగాని నోఁచికొనలేదు. గతించిన పదివత్సరములలో నీప్రతియొకటి నాయొద్ద నున్నదనువిషయమునుగూడ మఱచి నా యుద్యోగ నిర్వహణ విధులలోనే మునిఁగి కాలము గడపుచుంటిని. ఇట్లుండఁ బ్రస్తుతము నేను పనిచేయుచున్న పాతపట్నం తాలూకాకచేరీలోఁ బ్రస్తావికముగా నా రచనల ప్రసక్తిరాఁగా నముద్రితమగు నాటకమొకటి నాయొద్దనున్నదను విషయము జ్ఞప్తికివచ్చినది. నేనప్పుడా విషయమును బ్రకటింపఁగా నప్పటికి పాతపట్నం అసిస్టెంటు మేనేజరుగా నున్న శ్రీ కొల్లూరు వేంకటేశ్వరులుగారున్ను, అప్పటి మైనరు యిరిగేషన్ వోవర్సియరుగారైన శ్రీ T రామారావుగారున్ను పర్యాలోచించుకొని యీ నాటక ముద్రణమునకుఁ దప్పక ప్రయత్నించెదమని వాగ్దానమొసంగి తొలుదొల వారే వారికిదోఁచిన ధనసహాయమును వెంటవేకావించి

మఱియు వారికనుకూలురగు వారిచే నింకఁ గొంతధనము నిప్పించిరి ఇఁక నీనాటకము నెట్లైన ముద్రింపించఁగల్గుదునను విశ్వాసము నాలో జనింప నేనును గొంత ప్రయత్నించి యప్పటికి డిప్యూటీ పంచాయితీ ఆఫీసరుగానున్న శ్రీ K అప్పారావుగారిద్వారా కొంతపైకము సంపాదింపఁ గల్గితిని ఇట్లు కొంతధనమును సేకరించి యింతద్రవ్యము లభించిన దనియు దీనికో గ్రంథముద్రణము పూర్తియగునాయనియు ఏలూరులోనున్న నా జనకపితృపాదులగు బ్రహ్మశ్రీ కట్టి గంగరాజుగారికొక లేఖవ్రాయఁగా వారు వెంటనే లభించిన ద్రవ్యమును బుస్తకమును బంప్రమనియు మిగిలినది మేము పూర్తిచేయుదుమనియుఁ బ్రత్యుత్తరమొసంగినారు నేనును పరమానంద భరితుఁడనై లబ్దద్రవ్యమును బుస్తకమును బంపఁగా నేఁటికీరూపమున నీగ్రంథము వెలువడినది ఈ గ్రంథముద్రణమునకుఁ దోడ్పడిన మహోదారులందఱకును గృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాఁడను అతి బాల్యమున శాస్త్రజ్ఞాన మిసుమంతయులేని వయసులో రచింపఁబడిన దగుట యిందనేక దోషములుండవచ్చును వానినెల్ల సౌహార్దంబునసైఁచి యిందున్న సుగుణములనే గ్రహింప సహృదయులగు విద్వజ్జనంబులను వేఁడుచున్నాను.

ఈరూపకము నత్యంతాదరముతోఁ బరిశీలించి వాత్స ల్యముతోఁ దమతమ యభిప్రాయాదుల నొసంగిన శ్రీ అద్దే పల్లి కుటుంబరావుగారికిని, ఏలూరు కళాశాలాంధ్రోపన్యా

సకులగు శ్రీ పండితారాధ్యుల చినవీరేశలింగము (B A Honrs) గారికిని, పర్లాకిమిడి కళాశాలాంధ్రోపన్యాసకులగు శ్రీ B V సూర్యనారాయణ (M A) గారికిని, శ్రీ సోమేటి సూరి లింగముదేవరగారికిని కృతజ్ఞతాపూర్వక వందనశతంబు లర్పించుచున్నాఁడను

ముఖ్యముగా నీ గ్రంథము నామూలాగ్రముగఁ బరి శీలించి నిర్హేతుక ప్రేమతో పరిష్కరించి యమూల్యమగు పీఠికనీగ్రంథముఖాలంకారముగ నొనర్చిన "విమర్శకాగ్రేసర, ధర్మభూషణ, శివశరణ, ఐతిహాసికసమ్రాడా" ద్యనేక బిరు దాభిశోభితులగు శివశ్రీ బండారు తమ్మయ్యగారికిని, తమ ప్రేమపూరితాశీర్వాదము నొసంగిన మద్గురువరేణ్యులు పండిత ప్రకాండులునగు శ్రీ కట్టి సాంబమూర్తి శాస్త్రిగారి కిని ప్రత్యేక భక్తిపూర్వక వందనశతసహస్రంబు లర్పించు చున్నాఁడను

కం॥ చెల్లదె వచింప నామే
నల్లుని సోమంటివంశ్యున స్మత్కృతి ము
ద్రోల్లసనచిత్తుఁ గవితో
ద్యల్లాలసుఁ జంద్రశేఖరాచార్యునిటన్

ఇట్లు
విబుధసుకవిజన విధేయుఁడు
కట్టి భీమలింగాచారి
గ్రంథకర్త

వాతపట్నం,
8—10—58

# ముద్రణ ధనప్రదాతలు



శ్రీ K వెంకటేశ్వరులు B A, అప్పటి అసిస్టెంటు మేనేజరు పాతపట్నం
, T రామారావు, అప్పటి మైనరు యిరిగేషను వోవర్సీయరు పాతపట్నం
, B వాసుదేవరావు B L, రివెన్యూ యిన్స్పెక్టరు మెలియాపుట్టి
K విఘ్నేశ్వరాచారి రివెన్యూ యిన్స్పెక్టరు పాతపట్నం
,, A వెంకోభారావు, రివెన్యూ యిన్స్పెక్టరు ధర్మలక్ష్మిపురం
, Y బ్రహ్మలింగస్వామి, అప్పటి రివెన్యూ యిన్స్పెక్టరు టెంబూరు
, P నరసింహారావు
,, S ఆదినారాయణ
, M V సత్యనారాయణ

} అప్పటి అసిస్టెంటు మేనేజరు ఆఫీసులోని యుద్యోగి బృందము

,, కత్తి గంగరాజు ఏలూరు
, లండ రామమూర్తి, సీది
, P వెంకట్రావు, ఘనసర
,, G శ్యామసుందరరావు వడ్డంగి
,, P వరహాలునాయుడు, భామిని

మ॥ పరమోదారగుణ ప్రకాశితమనఃపంకేజులుద్యత్కళా
దరణోపార్జిత సద్యశస్కులురు విద్యావైభవోపేతులీ
సరసుల్ వీరలనెల్ల నిర్భరకృపాసంపూర్ణుఁడద్రీంద్రజా
వరుఁడశ్రాంతమొసంగుఁగాక వివిధైశ్వర్యాయురారోగ్య
ముల్.

ఇట్లు
కత్తి భీమలింగాచారి
గ్రంధకర్త

# పాత్రలు

## పురుషభూమికలు

పంచపాండవులు
శ్రీకృష్ణుఁడు
వ్యాసుఁడు
మాయాముని (దేవేంద్రుఁడు)
దేవేంద్రుఁడు
శంకరుఁడు
కిరాతుఁడు
ప్రమథులు (ఇరువురు లేక ముువ్వురు)
మాతలి
బృహస్పతి
రోమశుఁడు
దిక్పాలురు (ఏఁడుగురు)
పాండురాజు

## స్త్రీభూమికలు

ద్రౌపది
పార్వతి
కిరాతి
ఊర్వశి
అప్సరసలు (రంభాదులు ముగ్గురు)

ఓమ్

# భిల్లఫల్గునీయము

## (నాటకము)



(నాంది)

శా॥ శ్రీసాంబాంగనర్ధదేహమదిరాశ్లేషింగాంచి దేవీ! నినున్
మోసంబేమియుఁజేయ భిల్లివగువాఁడై భూర్యావహా
వాలోకనో
ల్లాసం జేసెదనంచుఁ బాశుపతభల్లావాప్తిమై ఫల్గునున్
వాంఛం బ్రోచెఁబు భిల్లమూర్తి కరుణాపాథోధి
మిమ్మోమ్ముతన్

(నాంద్యంతమున నటీసూత్రధారులు)

సూ॥ —నటీమణీ! నేఁడీ పౌర మహాశయులు మనల నొక్క రసవన్నాటకంబుఁ బ్రదర్శింప నాజ్ఞాపించి యున్నారు ఎద్దానివాడి యీరసికజనాకీర్ణసభారంజనముగావింపఁ గలము.

న॥ —ఆర్యా! సర్వనాటకాలంకార పారంగతులగు మీరిట్లాలోచించుటం జూడ సర్వజ్ఞుండగు శంకరుండు భిల్లుఁడై పల్గునుబహుసారపరీక్ష సేయఁబూనినట్లున్నదే కాని నిక్కంబుగా మీరెఱుంగరే?

సూ — మేలుమేలు నటీమణీ! యీ యుపమానముచేఁ
జక్కని నాటకంబొండు స్ఫురింపఁ జేసితివి
న — ఏమది మహాశయా?
సూ — అది భిల్లఫల్గునీయము
న — ఏమీ భిల్లఫల్గునీయ మనునొక నాటకముగూడ రచింపఁ
బడెనా? ఎవరు రచించిరి?
సూ — ఆ నాటకంబునే యెఱుంగవా? అట్లైన వినుము

సీ. మిత్రసంఘము మెచ్చఁగ జిత్రపద్యములతో
ఘటియించె శర్వాన క్షత్రనాలఁ
బారవశ్యము హేమ క పదకంబు నర్పింప
వ్రాసె భార్గవవీర క వరు చరిత్ర
సత్కవీశులు సంత క సమున సంభావింప
బసవ కల్యాణ కా క వ్యమును గూర్చె
రసికవర్యుల చిత్త క రంగంబు లలరింప
నీ నాటకంబు సం క ధాన పఱచె

గీ. నిఱువదియు రెండునేండ్ల వాఁ క డిందు వదన
క్షత్రి వంశామృతాబ్ధి రా క కా విధుండు
భీమ లింగాఖ్యుఁడతఁడు సం క విత్ప శస్త
సుకవి పండితసేవన క ప్రకట బుద్ధి

న — అట్లైన నిఁక నాలసింపనేల?
సూ — ఏమియులేదు పాత్రల సిద్ధపఱుపవలయును పదపద
(నిష్క్రమింతురు)

---

# ప్రథమాంకము

(ద్రౌపదీ సహిత పాండవులు)

ధర్మ — ప్రియులారా! నేటికెట్లో యొక వత్సరంబు సుఖముగా గడచినది సాజ్ఞాతవాసంబుఁగా నింకంబండ్రెండేండ్లు గడపవలసి యున్నది అయ్యదియు మన శ్రీకృష్ణ భగవానుని దయచే సుకరంబుఁగా గడపఁగలము రండు రండీద్వైత వనంబు నెద్దియే నొక్క రమ్య ప్రదేశంబున విశ్రమింతము (అటునిటు చూచి) ఆహా యీ ప్రదేశమెంత రమ్యముగా నున్నది పరిపక్వఫలసమేత చూతాదిభూజాతంబులు, సంఫుల్ల పుష్పమకరందసక్త లతాజాతంబులు, సరస్సరోజనృత్యానందమిళింగసంగీతంబులు మన పారవశ్యంబుఁగూర్చుచున్నయవి తమ్ములారా! ఈ వత్సరంబునకిందు విశ్రమింప నామనం బిచ్ఛగించుచున్నయది మీ కిది సమ్మతమే

భీ — అగ్రజా! మీ యాశయమే మా యాశయము తప్పక యిందే విశ్రమింతము తమ్ములారా! రండు మనము పోయి కుటీర నిర్మాణ కార్యంబునఁ బాల్గొందము

అర్జు — అట్లే నడువుడు

అందఱు — సోదరా! యీరివోచ్చెలనే యుండుడు

ధర్మ — శీఘ్రముగా నొవచ్చును

(విహారము ప్రక్రమింపరు)

ధర్మ — దేవి! పాంచాలరాజపుత్రీ! ఈ ప్రదేశమెంతయు
రమణీయకముగా నున్నదికదా!

చ॥ కల భ్రమరకంఠరవర గానరవ ప్రతిశబ్దితాటవీ
కలకలముల్ మనోజ్ఞపరి కల్పిత దుఃఖము
దూలఁజేయఁగా
విరిసి సరోజషండమున రంద సుగంధనిగుంభితానిలా
వళులు పథాటనశ్రమము వాపఁగ నిష్ఠలమింపు నింపదే

మఱియు ననేక పరిచారికాసేవ్యమానమహాంతఃపుర
సంచారిణివగు నీకు

సీ॥ తేటి యంటునఁగుంది తెమలుపేసుమరాజ
కోమలామలశయ్యఁ గూర్చుఁగాక
తారునంతనె చిందు తమ్మి తేనియఁ గ్రోలి
భవ్యంబుగానళుల్ పాడుగాక
పాలయు నంతనెహోయి పులకించు నీగాలి
విలసల్లు సురటియై వీచుఁగాక
విన మనంబు కరంగు వేడుక పల్కుల
నీశుకాదులు ప్రోత్సహించుఁగాక

గీ. దీన జనతాశరణ్య యీ కాననేంది
రామతల్లియె ముఖ్యాళి వైయె మనమ్ము
రంజలగఁ జేయుఁగాక యో మంజులాస్య
మోహనాంత పురావాస ముదముగూర్చి

కావున నంత పురసౌఖ్యంబుగా నిక్కనస వాసంబుఁ
గను విచారమ్ము దూరము సేయుము

ద్రౌ — ప్రాణేశ్వరా! సమస్తావనీపాలమకుటమాణిక్యమ్మరి
తాంఘ్రియుగులు మీరే యీకరికోపలసంచారంబునకు
నొవ్వక మనోహర లతాలతాంతశోభాకలనం బున
కానందించుచుండ నాధానుసారిణి నగు నాకానంద
మునకేమి లోపము? అయిన నొక్కొక్కవేళఁ బూర్వ
ప్రస్తుత దశాసమీక్షణంబు సేసిన నామనంబు నీరయి
పోవుచుండు

ఉ. ఈక్షణమాత్రముజ్జగముఁ బిట్టటు త్రిప్పఁగఁ జాలు శౌర్యసం
దక్షులు వశ్యులై యనుఁగుఁ దమ్ములు నల్గురు గారవింప స
ర్వక్షితిపాలకుల్ గొలువ రాజ్యము సేసెడి మిమ్ము నిప్పుడీ
రూక్షవనీ శిలాశయన రూఢులఁగాఁగని యోర్వ శక్యమే?

ధర్మ — దేవీ! సకలధర్మరహస్యజ్ఞవు లౌకికవ్యాపారపారీ
ణవు నగు నీ విట్లు పల్కఁదగునే? సర్వకష్టసుఖం

బులు పురాకృతఫలప్రాప్తంబులనియు నవశ్యానుభావ్యంబులనియు నెఱుంగవే? మనవలెనే పురాతన మహారాజచంద్రు లెందఱో కాలవశంబున నిడుమలం గుడువరే?

క. నలదమయంతుల సీతా
జలజాక్షి రఘువులను శ్లాఘించెడి యా
విల సత్కథాసమూహము
లిఁ నెఱుఁగవె? భాగ్యహీనులె? యాధన్యుల్

ద్రౌ — ఆర్యా! శనిమాపిష్టుఁడై నలమహీపాలుండను, జనకు రాజ్ఞాబద్ధుఁడై రఘురాముండును వనములకేఁగవలసెంగాని మీవలె వంచితులు కాలేదుకదా! మాయాద్యూతంబుఁగల్పించి సర్వస్వ మపహరించి కట్టుపుట్టంబులతో మనల వెడలఁగొట్టు సుతునట్లే చూచుచు మిన్నకుండిరే కాని, మామగారైన వలదని వారించిరా

ధర్మ — భామినీ! ఒకరు వారింపలేదని దూఱనేల? అట్లొకవేళ పెదతండ్రిగారు వారించియున్నను మన కసత్యదోషంబు సంభవించి యుండదే?

ద్రౌ — నిర్మాయిక ద్యూతమైనచో నట్లేయగు మొదటఁ జూదమె మాయికమైనది గాన యట్టి దోషంబులేదని తాను వారింపవలను గాదా? అయినను పుత్త్రప్రోత్సాహకుండగు నతఁడేల యట్లొనర్చు

మ. సభలోఁ బెద్దలుఁ బిన్నలున్ సముచిత । స్థానంబులన్
పౌరుషా
రభటిన్ మీసలుఁ ద్రిప్పఁ బౌరుషవిదూ । రవ్రీడమీరొం
దఁగా
రభసవ్యాపృతి మత్కటీమలినవ । స్త్రంబూడు వేళన్ సభా
ప్రభువుల్ సవ్వఁగ నాలకించుట యెటుల్ । ప్రాప్తించు
నాత్మేశ్వరా

(భీమార్జునులు ప్రవేశింతురు)

భీమ — ఓమానినీ మణీ! ఏటికిట్లు మాటిమాటికిఁ బౌరుషవిహీనులని మా బాహుసారంబు లెఱుంగనట్లెత్తిపొడిచెదవు?

శా. చేతంబట్టి మదేభరాజశతమున్ । శీర్యన్మహాంభోధర
వ్రాతంబోయన మింటికిన్ విసరుదీ । వ్యద్బాహువిక్రాంతుఁడీ
వాతూలాత్మజుఁ డేటికిన్ వెఱచెనో । పార్థాదియోధాగ్రవి
ఖ్యాతుల్ దేనికిలోఁగిరో యెఱిఁగి యి । ట్లాడంగ
సంభావ్యమే?

ఈ పాండవేయుల క్రోధానలజ్వాలిక లేమాత్రమైనఁ బైకి పొంగియుండు నెడల నాధార్తరాష్ట్రవంశారణ్యంబు సమూలంబుగా దగ్ధంబుగాకుండెడిదే? పాండవేయులందఱు నేల?

ఉ. సోదరునాజ్ఞ యింతయిన । జొప్పడియున్న నిమేషమాత్రమ
న్నేమరబాహాదండసము । దీర్ణగదావివిధప్రచాల నా

నాదితమారుతంబె పర సంపత్సా మహార్ద్రా ప్రవి
చ్ఛేదమొనర్చి దుష్టకురుశేఖరువంశము హాప్పాంపనే?

ద్రౌ — ఏల యీ వృథా పరోక్షప్రలాపంబులు కార్య
రూపంబు దాల్చినంగదా తత్ప్రయోజనంబు

భీ — అన్నయ్యా! పవిత్రక్షత్రియవంశసంజాతులమై బాహు
బలప్రసిద్ధులమై పరులచే పరిక్లిష్టులమైయుండఁదానివె
గాడ సహించియుండుటయేల? ఇప్పటికైన సెల
వీండు దార్తరాష్ట్రకుజంబు సమూలంబుగా పెకల్చి
యిలాతలంబెల్ల మీపాదాక్రాంతంబు గావింతెద

ధర్మ — తమ్ముఁడా! భీమసేనా! ఎవంతటి సామర్థ్యంబు
కలవాఁడవే కాని

క. ధర్మపాశ నిబద్ధ సం దర్భ వశత
బాహు శౌర్యంబు లవిబయ ల్పడఁగఁ జన్నె
కాలమిదికాదు యుద్ధరం గమున కుఱుక
ఆవఱకు శాంతిపూనుమో యనిలపుత్త్ర!

భీ — ఏమి శాంతి! క్షత్త్రియ కుమారులకు శాంతియా
భూషణము

ధ — క్షత్త్రియకుమారులకుఁ బౌరుషంబే యలంకారమైనను
నయ్యది ధార్మికమైననే గదా ప్రకాశించును

భీ — అట్లయినను మనమిప్పట్టున యుద్ధమునకై బయలు
దేఱుట ధర్మబద్ధమే కాఁగలదు

ధ — ఎట్లు కాఁగలదు?

భీ —మనమిప్పటికిఁ బదుమూఁడు మాసంబులు వనవాసంబుఁ
గడపినారముగదా మన యొడంబడికయు బదు
మూఁడు వత్సరంబులేగదా సంవత్సర ప్రతినిధిగా
మాసంబు లెక్కించుట ధర్మశాస్త్రమర్మమే కద
ఇంకను నధర్మమని సందేహింపనేల ?

అర్జు — అగ్రజా ! ఈ యనిలసూను వాక్యంబులెంతయు
యుక్తియుక్తముగా నున్నవి కాన సందేహింపనేల ?

శా దిక్కుల్ మ్రోయఁగనబ్ధులేఁడు రభసోద్రేకంబునం బొంగఁగా
నక్రౌర్వ్యానుదంచియు తామలమణిహార్యాసనం బూఁగఁగా
రిక్కల్ రాలఁగ వేయుమాఁడివనచే రిన్ వైరివీరప్రజ
న్యక్కారోజ్జ్వల శాగ్రసారవిభవవ్యాపారమే వారఁగన్

నకు —సోదరా ! నిశ్చయముగా యుద్ధసన్నద్ధులము గావలసి
నదే అన్యాయముగా మనకీ బాధలఁగల్పించిన
యద్దురాత్ముల నింక సైఁపరాదు

సీ సకలావనీపాల సంఘసేవితుల నా
తతవనీ మృగనిషేవితులఁ జేసె
మణిమయ ప్రాసాద మందిరావాసుల
ఘోరాటవీవాసి కులనుఁ జేసె
తూలికాశయ్యా కుతూహలాంగుల మహో
కఠిన పాషాణ సంగతులఁ జేసె

ఘనసార కస్తూరికా లిప్తగాత్రులఁ
బ్రకట భూరేణు లిప్తకులఁ జేసె

గీ. నట్టి యార్త్యాప్రపూర్ణ చిత్తాంబుజాతుఁ
బ్రళయకాలానలోగ్ర మార్గణ కదంబ
దారితాంగునిఁ జేసి యుద్దండ పరిభ
వాగ్ని కీలలచే దహింపంగ వలయు

సహ - అంతియగాదు సహోదరులారా!

గీ. వృగుల బాహో మహాధామ భీము భీము
పరిలము లయందుఁ ద్రోచిన పలమునంగ
దుష్టదుర్యోధనాఖ్యకుఁ దోయమధ్య
బాధితాంగునిఁగా నొనర్పంగ వలయు

దౌ - ప్రాణేశులారా! ఎవఁకిఁ దోఁచినట్లు వారాడిరేగాని
నా సమయంబు నెవ్వారు గుర్తింపరైతిరే

భీ - బామినీమణీ! ఆనాఁటి సభామధ్య కృతప్రతిజ్ఞ నేను
మఱవలేదుసుమా

మ. అలదుర్యోధను పెందొడల్ విఱిచి నిర్యద్రక్తధారాసమా
కలనక్లిన్న శిరోజపాశఁగ నినుంగావించి నీమాటయున్
ఫలితంబుం బొనరించువాఁడ రమణీ ప్రాఘోర చింతామహో
కులిత స్వాంతము పల్లవింపనిఁకపైఁ గుందంగ నీకేటికిన్

ధర్మ - తమ్ములారా! ఎందుకీయసమయ రౌద్రాలాపంబులు.

ఉ ధర్మవిదూరచిత్తులకుఁ దార్కొనఁ బోవుజ
యేందిరాసతీ
నర్మవచోవిలాసముల నన్ వినవయ్యెడిఁగాన మర్మ యు
ద్ధర్మసమర్థనీయగుణ గౌరవమాదటఁబూని దుర్యశ
కర్మము సేయఁగాఁదగునె కాలమురావలదే ?
జయాప్తికిన్

అర్జు —అన్నయ్యా ! సకలధర్మ స్వరూపులరగు మీ మాట
కెదురాడ నోపంగాని—

చ జయమునకేమిశంక పృధు శౌర్యయుతావరజవ్రజంబుని
ర్భయముగ శత్రులన్ శమనపట్టణపాంథులఁ జేయనేర్వ న
వ్యయవచన ప్రభావుఁడగు వారిజనాభుఁడు వత్స
లాత్ముఁడై
జయముఘటిల్లు మీకె యని సంతతమున్ వచియింపు
చుండఁగాన్

వకు —భీమసేను వచన ప్రకారంబు ధర్మశంకయు విజయు
వచన ప్రకారంబు విజయ శంకయుఁ దీఱిపోయినవి
గాన యింక నుపేక్షింపనుచితంబు గాదు

శా లాక్షాగేహములోపలన్ మములనెల్లంబెట్టి మాయాకళా
దక్షుండై దహియింపఁజూచినదురాత్మభ్రాతు
దుర్యోధనున్

చున్నాఁడు కానిమ్మాయన క్రప్రతియేం లుగవల
యును ?

(అం-ఁగోఁ గల పము)

సహ —ఏమి యీ కంకలము మన ధర్మజు నమోఘవచన
ప్రకారంబు శ్రీకృష్ణుఁడే కెంచుచుండెనా యేము !

భీమ —లేక మద్గదాఘాతంబులఁ బాలువడ దుర్యోధనుండే
వచ్చుచుండెనా !

అర్జు —(లేచిచూచి) ఆహా ! మన కృష్ణ భగవానుఁడే !
నిస్సంశయము

చ అదె గరుడధ్వజంబు జలకజాప్తుని ధాశ్వఖలీన సర్పముల్
చెదరఁగ నభవీ విలకసిల్లుచు నున్నది నిస్తులంబుగా
నదెయనతాచ్ఛకాంతి పధకమంతటఁ బర్వెడిఁగాన
యాతఁడే

యదుకులభూషణుండగు నకహాచనుదెంచెఁ
దలంచినంతలో !

ధర్మ —(తనలో) భక్తవత్సలుఁడు మదాశయము నెఱ
వేర్చుఁగాక ! (ప్రకాశము) సోదరులారా ! ఎదురు
పోవుదము రండు

(కృష్ణసహితముగా వచ్చును)

ధర్మ —బావా ! యశోదాది పుణ్యాంత పురస్త్రీలకును
బలదేవ ప్రముఖ బాంధవులకును సర్వయాదవులకును
శ్రేయంబే కద ?

శ్రీకృష్ణ —ఆహాఁ !

ఉ॥ బందుగులెల్ల భద్రగుణ బంధురులై విలసిల్లుచుండ్రి మీ
నందనుఁడైన పార్ద్యు ది నంబు దినంబునుగీష్మకాల మ
ధ్యందిన చండభానునివి ధంబునఁ దేజముఁగందుచుండె సా
సందులు యూదవుర్, వ్యథ మ నంబున నొక్కటి
మీఁగుడెం వియే

నన్నెటఁగన్నను వారులెల్లఁ బాండవు లెచటనున్నారు? ఎప్పుడు వత్తురు? అను ప్రశ్నలచే ననుముంచివేయు చుందురు వారికి సమాధానము లిచ్చుసరికే నాపని తీఱిపోవుచుండు

అర్జు —ఏదయాసంప్రాప్తిచే సర్వకాల శుభాను భూతులమగు మాకునై చింతింపనేల?

శ్రీ —ఏమిశుభంబులనుభవించుచుండిరి మీ యీమస్తు కాంతారవాసక్లేశంబుఁగాంచు నామనంబే ఖేదిల్లు చుండ నిజముగా మీకెట్లున్నదో కదా?

భీమ —మా యీ క్లేశంబు సహింపలేకున్నఁ దన్ని వారంబు సలుపరాదా

శ్రీ —ఏమేమి! భీమసేనా!

శా॥ ఏనామీవ్యథఁ బాపువాఁడనహా హా యీ మాట
లిట్లాడఁగా
నీ నోరెట్లువచ్చె? నిష్ఠురగదా నిర్ఘాత పుంజంబుచే
సానీకంబుగఁ గౌరవున్ దునిమెదీ వంచుండలంపన్ సురా
పానోన్మత్తుని రీతినాఁడితి విటుల్ బావా! యిదే
సత్యమా?

భీమ — శ్రేయోఽర్థివని తలంచి మా బాధా నివారణో
పాయంబుఁ దెల్పెదవని కోరితిమేగాని మా దౌర్బల్యం
బుచేఁ గాదు ఇంతలోననే

శా. నీ యాదవ్యముఁ జూపనాఁడె వహాహా । నీవేమహా వీం గా
నే యుండెదవె? పాండవేయులు బలో । న్మేషుల్
గదా! చాలునీ
నాయంబేరికిఁ గావలెన్ ఘనగదా । సంఘాత సంఘాతమే
పాయంజేయఁగఁజాలుఁ గౌరవజన । వ్రాతాయు
రంగంబులన్

ధర్మ — ఆఁ! ఆఁ! భీమసేనా! మనకష్టోపశమనంబొనర్ప
నేతెంచిన దయాసింధువునా తూలనాడుట?

భీమ — ఔనౌను మనకష్టోప శమనార్థమే యీతనిరాక?

ఉ. గొల్లలయిండ్లలోఁదిరిగి । గోడలుమిద్దెలుగెంతి దొంగయై
చల్లయు వెన్నయున్ మెసవి । చాలక వన్యమనోజ్ఞవస్తువుల్
చల్లఁగ మెక్కఁగా దిగియె । సంబరమొప్పఁగ నిప్పుడీతఁడో
నల్లలితప్రభావగుణ । సాంద్ర! యెఱుంగ మెవీని చెయ్దముల్

శ్రీ — నిజము నిజము మారుతీ! బాగుగా గ్రహించినాఁడవు
ఏమందువేని—

సీ. పాకవిద్యాప్రశస్తవి । భ్రాజ వగుటఁ
ద్వాత్కరాన్నంబుఁ దినగ సం । తసము గల్గ

వచ్చినాఁడ నేవేగ వంటయింటి
దాఁకి పట్టుము బావా! ముదంబుతోడ

అర్జు —తొందర పడనేల బావా! ఇంటికవచ్చినవారి నాదరింపక పంపములే సైఁగా—

సీ. పూతనాస్తన్య పానంబు చేతనైన
నోటిచేదొల్లఁ దిఱిఁగా నీటు గులుకు
మధుర పాయస పూపసంభారములను
మెక్కుచూపంతుమయ్య సమ్మదముగనుము

ధర్మ —తమ్ములారా! పరిహాసములు మితిమీఱుచున్నవి ఇఁక చాలింపుఁడు బావా! నీమఱందు లవివేకమునఁ బల్కిన హాస్యవచనంబుల సైరింపవేఁడెద

శ్రీ —సైరించుటకిందేమి యున్నది? మఱందులనియు హాస్యములనియు నీవేగదా పల్కితివి

సహ —ఈ హాస్యప్రసంగములచే మన నిశ్చిత కార్యమే మఱచినారము

శ్రీ —ఓహో ఏద్దియో క్రొత్తవిషయంబు వినఁబడుఁ గాఁబోలు ఏమి నిశ్చయించితిరి?

భీమ —మమ్ముల నన్యాయముగా వంచించి మాసర్వస్వమపహరించిన ధార్తరాష్ట్రుల యుద్ధమున సంహరించి మారాజ్యమును మే మనుభవింప నిశ్చయించితిమి

శ్రీ —భేష్ భీమసేనా! ఆమాట మొదటనే చెప్పియుంటిని ఇంక నాటంకమేమి?

అర్జు — ఏమియు లేదు అగ్రజునాజ్ఞకు నీయాశీర్వాదము నకు నెదురు చూచుచున్నారము

నకు — కావున వేగ దీవించి పంపుము

సహ — మఱియు నజాత శత్రునొడంబఱచి మాకనుకూలుం డవుగమ్మ

శ్రీ — ఓహో! ముఖ్యవిషయమునె మఱచితిరే! ఏమి ధర్మపుత్రా! ఆజ్ఞ నీయ నాటంకమేమి?

ధర్మ — బావా! అడుగవలయునని యడిగితివే కాని నా మనోనిశ్చయంబెఱుంగవే?

శ్రీ — అయిన నిమదేభంబు లాగుటెట్లు?

ధర్మ — నీహితోపదేశ శృంఖలా నిబద్ధులంజేయుదు వనియే గదా నిన్నుం బ్రార్థించుట

శ్రీ — సరి సరి ఇది యొకటియా! అగ్రజాజ్ఞానుసారులార! ధర్మపథైకసంచారులారా! సకలధర్మ స్వరూపుండును రాజతంత్రపారంగతుండునగు నీధర్మపుత్రుని వచనంబులలోని విశేషంబు గుర్తింపరేమి? ఏల వృథా యుద్ధమునకై తొందర వెట్టెదరు?

చ. తగదిది వేళగాదు బలస్థైర్యములన్ బయికుబ్బఁ జేయఁగా
నగణితసంఖ్యులై యుఱెక నాకురుసైన్యములెల్లఁ
మున్నె మీ
మగటిమి కోర్వలేక యవమానితులైన నరేశులెల్లరున్
దగిలిరి కౌరవేశుకడదర్పము మీఱ మిముంజయింపఁగా

మఱియు భీష్మద్రోణకృపాశ్వత్థామ కర్ణాది మహారథికులనేక దివ్యాస్త్రసముపేతులు వారలంగెల్చుటమీరనుకొనునంత సుసాధ్యముగాదు కావున దూరముగానాలోచింపవలయును

గీ॥ కడుఁబరాభూతులై కష్టకాలమెట్లో
గడపుచున్నారు విజనోగ్ర కాననములు
నిదియు నొకమేలె తలఁపఁగా నిపుడు మీకు
నిద్ధశస్త్రాస్త్రసిద్ధికి హేతువగుట

భీమ —విజనోగ్రకాంతారవాసము శస్త్రాస్త్రసిద్ధికి హేతువా? ఎటులు కాఁగలదు?

శ్రీ —చెప్పనిచ్చెదవా? లేదా? ముఖ్యముగా నిది చెప్పుటకేనే చేతెంచితిని ఇంతలో నీవింతరాద్ధాంతము సేసెదేల?

ధర్మ —బావా! వసుదేవకుమారా! హేతువెఱుంగ నామనంబు వేగిరపడుచున్నది వేగ తెల్పుమా

శ్రీ —అందఱు వినుఁడు వనంబులు మహామునీంద్ర జనాకీర్ణంబులగుటచేతను మీరును వానప్రస్థులగుట చేతను అట్టి మహోత్తమావకాశము సిద్ధించినది కావున నీయవకాశము పోఁగొట్టుకొనక భయభక్తులతో మునులసేవించి వారలచే వరంబులందియు నుపాసనలచే దేవతలమెప్పించి వారిచే నస్త్రంబుల నొందియు, సజ్జనుల సంతోషపఱచి వారి దీవెనల నందియు ఈ భావివిజయవృక్షమునకు దోహదమాచరింపవలయును

ధర్మ —నిజము నిజము కృష్ణా! ఎఱుంగనైతిని

శ్రీ —మఱియు ముఖ్యముగా

సీ శంకరునిఁ జూర్చి గాఢని * ష్ఠనుదపంబు
సల్పిపరిపంధి వర్గ ము * స్సహాభుజామ
హాపరాక్రమ నిర్మూల * నాతిదక్షు
మందు కొనవలెఁ బాశుపతాస్త్రమిపుడు

అయ్యస్త్రరాజంబు సిద్ధించెనేని మీవిజయంబొక విధంబున నిర్ణయించవచ్చు అందుకీ పార్థుండే సమర్థుండని తోఁచెడిని

ధర్మ —అవశ్యంబు నీహితోపదేశంబు సాక్షరంబుగా జరిపెదము నీకృపావిశేషంబునఁ బార్థుఁడయ్యస్త్రంబు వడయుఁగాక

శ్రీ —యూరకూరకయేయుండరాదు నేఁజెప్పినట్లు మహర్షాదుల సేవింపవలయు

ధర్మ —అట్లె యొనర్చెదము

శ్రీ —ఇఁక మీయిష్టము సోదరీ! ద్రుపదరాజకుమారీ!

గీ రుక్మిణీ సత్యభామాది * రుక్మగాత్ర
లెల్లసద్భక్తితో నమ * స్కృతులుసల్పి
తెలియఁగోరిరి నీ సేమ * ములనుగాన
నేమిసెప్పెదో చెప్పుమా * యెఱుకవడఁగ

ద్రౌ —అన్నయ్యా! చెప్పుటకేమున్నది అయినను ప్రేమతో నడిగిరికాన-

చ. మదనవశాప్తమైన నాటికి మొక్కుచును తృప్తచే
సఖీపతిపంచశరంబు ముడి మాదఁగ సేవలఁ జేయుచుంట నే
నెదమగు వింటలేదొకొ ఆ వేళవిషాదము గల్గుచుండె ని
స్సదిమముగా ని బంధునివహవ్యవహారసమాప్తిఁ జేసెదన్

అని యౌవనాసికి సముత్తరంబుగాఁ దెల్పుము

శ్రీ —(తనలో) ఔరా! ఏమి యీమె గంభీరభావము
(ప్రకాశము) ధర్మజాదులారా! ఇంకఁగ కర్తవ్యము?

న —ఈ నవీననిర్మితకుటీరము మీ పవిత్రపాద విన్యాసము గోరుచున్నయది

శ్రీ —అట్లే నడువుఁడు

(నిర్గమింతురు)

(ఇది ప్రథమాంకము)

(సంపూర్ణము)

# భిల్లఫల్గునీయము

## ద్వితీయాంకము

(ఘనారణ్యములలో మునివేషధారి యర్జునుడు)

అర్జు — శ్రీకృష్ణభగవాను నుపదేశాను సారముగ నీశుం
గూర్చినే నయ్యింద్ర కీలాద్రిం దపంబాచరించెదం
గాక ఆహా!

చ. అమితప్రభావిధురితాఘసమూహము లోలఁగాలమే
ఘములు చలింపఁగా, జితవికర్తన తేజమువోలె ధాతురా
గములు వెలుంగఁగా విగతకామముఖారులు సన్ము
నీంద్రసం
ఘములుఁ దలంప, నిన్నగముకట్టుల జేనిగ గోచరించెడిన్

ఇట్టి పవిత్రభూధరంబున భూధరాంగదునిఁ గూర్చి భూధరత్వ ప్రాప్తికై తపించుభాగ్యంబు సామాన్యముగా సిద్ధించునే? ఇంకఁ దడయక తపోదీక్షఁ బూనెదఁ గాక ఓహో యిదియేమి? తాతపాదులు వ్యాసమునీంద్రులిటే వచ్చుచున్నారు ఏమి నాభాగ్యము వీరిదీవెనలఁ గూడనంది పోయెదంగాక

(వ్యాసముని ప్రవేశము)

అర్జు —ఎతామహా ! వ్యాసమునీంద్రా ! నమస్కారము

వ్యాస —మనోఽర్థ సిద్ధిరస్తు

అర్జు —మహానుభావా ! మీవాక్య మమోఘము

వ్యాస —విజయా ! నేను మీసహోదరులంజూడ వేడుక
పొడమి యేతెంచుచుండ దైవికముగా నీవిందే యెదు
రైతివి అందఱును సేమమేగదా !

అర్జు —మీవంటి మహనీయుల కృపచే నిప్పటికి సుఖులమై
యున్నారము

వ్యాస —సంతోషము ఇప్పుడు నీవెద్దియో కార్యాతురుం
డవై యేఁగుచున్నట్లున్నది

అర్జు —ఈశుఁగూర్చి తపంబాచరించి పాశుపతాస్త్రంబు
వడయ శ్రీకృష్ణ ప్రేరితుండనై వచ్చుచున్నవాఁడ

వ్యాస —కుమారా ! విజయా ! నీను నయ్యుపాయంబుబోధిం
చుటకే వచ్చుచుంటిని అద్దాని శ్రీకృష్ణభగవానుఁడె
ర్చినాఁడు ఆపరాత్పరుడు మీపట్ల సంపూర్ణాను
రాగియై యున్నవాఁడు కాన మీకెట్టిలోపంబునుం
గలుగఁబోదు అయిన నొక్క విశేషము

చ తొలుత మహేంద్రుఁగూర్చి మదిఁ శ దోరపు నిష్ఠఁదపం
బొనర్చియ
య్యలఘునిచే మహాస్త్రముల శ సంది దిగీశులచేతఁగూడను
జ్వలతరశస్త్రముల్ వడసి శ శంకరుఁగూర్చి తదుత్తరం
బునన్
సలుపవలెందపంబు విల శ సత్తరపాశుపతాస్త్ర సిద్ధికై

అర్జునా! తొల్లి వృత్రాసురనకు వెఱచి పాఱి పోవు సమయంబున దేవతలు తమ తమ యాయుధంబుల నెల్ల వజ్రకొసంగిరి. ఇప్పుడాతని ప్రసాదంబుననవి యన్నియు నీకు సిద్ధింపఁగలవు మఱియు నింద్రప్రసాదంబుచే నీశ్వరప్రసాదంబు గూడ సులభంబు కాఁగలదు

అర్జు —చిత్తము మహాత్మా! అట్లే యొనర్చెద

వ్యాస —మఱియు నీకు నిర్వికార తపస్సామ్రాజ్యసంసిద్ధికై
యిదిగో "ప్రతిస్మృతి" యనువిద్య నుపదేశించు
చున్నాఁడ, (చెవిలో చెప్పును) ఇద్దానిచే నీకు
నింద్రమహేశ ప్రసాదంబులు సులభంబులగు

అర్జు —ధన్యుండ! ధన్యుండ!

వ్యాస —మఱియు నొక్క విశేషము

చ శమముదమంబుశాంతియువిరాగాలతరామలనిష్ఠయున్ మనో
జ్జమున దృఢీకరించుకొనిబాహిరహేయ వికారమార్గ లా
ల్యమును దృఢీకరించి మఱియాతపశీతల వర్షబాధ క
క్రమమునకోడకే స్థిరముగాదప మీవొనరింపు మర్జునా!

అర్జునా! ప్రతిపేని నీసంకల్పసిద్ధి కెట్టి సందియమును లేదు ఇఁక నేఁబోయివచ్చెద

అర్జు —ధన్యుండ మహాత్మా (అని నమస్కరించును)

వ్యాస —విజయోఽస్తు (నిష్క్రమించును)

అర్జు —ఇట్టి మహనీయుల దీవెనలు నుపదేశములును గల్గు
చుండ నింక నాకేమి కొఱఁత ఈయన చెప్పినట్లే

చ. శమదమయుక్తసత్తపము సొప్ప మహేంద్రమహేశ సత్క్రియా
క్రమసముపార్జితాస్త్రములు గౌరవమొప్ప సహస్త్రమిత్రసై
న్యము గవధించి బాహువిభవార్జితరాజ్యరమా వధూటి మా
శమనకుమారు పాదజలజద్వయ సీమవిలగ్న జేసెదన్

(అని ముందుకు నడచును)

(ఇం ము వేషమున ఇంద్రుఁడు వెనుకనుండి)

ముని — ఓయిధన్వీ! ధన్వీ!

అర్జు — (వెనుకకుఁ జూచును)

ముని — ఆఁగుమాఁగుము

అర్జు — ఎవరునీవు?

ముని — నేనెవరినైననేమికాని ముందునీవు వెనుకకుమరలుము

అర్జు — ఏమి?

ముని — ముందుకు పోఁగూడదు

అర్జు — ఎందుచేత?

ముని — ప్రశ్నలచే కాలయాపనచేయక ముందు వెనుకకు తిరుగుము

అర్జు — కారణము చెప్పకయే వెనుకకుఁ బొమ్మనియెదవేమి?

ముని — పోకున్న ముప్పుఁజెందెదవు సుమీ!

అర్జు — ఎందుచేత!

ముని — వారుగో! మహాత్ములు వారుచూడకుండఁగనే మరలిపొమ్ము

అర్జు — మహాత్ములకు మఱుఁగుపడనేల?

ముని — అన్నన్నా! చెప్పక వినవుగదా!

అర్జు — ఏమి చెప్పితివి?

ముని — వెనుకకు మఱలుమని

అర్జు — కారణము?

ముని — చెప్పవలయునా? వారు గీర్వాణులని యెఱుంగవా?

అర్జు — అంతమాత్ర భయంపడనేల?

ముని — వారు నీవంటివారింజూచి సహింపరు

అర్జు — నావంటి వారన గా? నాయందేమిదోషమున్నది?

ముని — ఓయి పచ్చివాఁడ! ఏమిదోషమా—

చ. బహుమద సంయుతాత్ములగు పార్థివరాజికి యుక్తమైన బ
ల్విలు ధరియించియుంటి కడు వేంద్రమునిముఖ
మండలాభయు
జ్జ్వలితభుజాయుగంబతివిశాలమునిట్టి మహోమహోగ్రరే
ఖలుగలయట్టి నిన్నుచటఁ గాంచి సహింతురె? తాప
సోత్తముల్.

అర్జు — ఓహో! ఇదియా నీయుద్దేశము ఇద్దానికై యెంతయో
యుపన్యసించి యాయాస పడితివి ఇఁకఁబొమ్ము

ముని — ఏమీ! నామాట తిరస్కరించి మునీంద్ర శాపాగ్నికే
పాల్పడ సాహసింతువా?

అర్జు — పచ్చివాఁడ! ధనుర్బాణము లున్నంతమాత్ర

యుక్తాయుక్త విచక్షణత లేక మునులు శపింతురా ?
మఱియు భయములేదు నీవు పొమ్ము

ముని —అట్లయినచో౯ శోకమాన నందువా ?

అర్జు —తెప్పక పోయి వాంఛపడ్డనే తపంబాచరించెద

ముని —ఓహో ! ఇది మఱియు యుక్తముగానున్నది

అర్జు —ఏమిది ?

ముని —ఏమియా ? ఇట్టి విపరీత తపంబెచటనైన నున్నదా ?
తపము చేయువారు విభూతి రుద్రాక్ష మాలికలఁ
దాల్తురు కాని ధనుర్బాణంబులను దాల్తురా ఏమి ?

అర్జు —పవిత్ర రాజకుమారుండనగుటఁ దపోనిరోధక దుష్ట
జంతువులంగూల్పనివ్వానిధరించితి ఇందుదోషమేమి

ముని —అంతటి సత్త్వబల సంపన్నుఁడ వన్నమాట పవిత్ర
రాజకుమారు డవైన రాజ్యంబులేలకి తపంపఁ దొడ
రితివేల ?

అర్జు —శత్రువిజయార్థ మింద్రునిచే నస్త్రంబులఁ బడయుటకు

ముని —ఓహో ! ఇది మఱియు విచిత్రముగా నున్నది

అర్జు —ఏమది ? ఏమాటాడినను హాస్యమునకే యుపక్ర
మించెదవు

ముని —హాస్యంబుకాక ? ఎవ్వరైనను విష్ణుఁగూర్చియో లేక
యీశ్వరుఁ గూర్చియో తపస్సు చేయుదురుకాని
యింద్రునారాధించు వారెవ్వ రుందురయ్యా

గీ. రెండు కన్నుల విష్ణు దూ ౯ రీకరించి
మూఁడు కన్నులవేల్పు పెం ౯ పునుహాసించి
వేయి కన్నుల వాఁడంచు ౯ వెఱ్ఱిపడి తొ
ఇంద్రుఁ గూర్చి తపంబుఁ గా ౯ వింప నీవు?

పోనీ యావేయి కన్నులైనను మాహాత్మ్యసూచకంబులా యన్ననట్లుగాక యవిమహాపాతక సంసూచకంబులు. అట్టి సహస్రాక్షుఁడా నీకు ధ్యాతవ్యుఁడు

అర్జు —ఏమి నీయసంగత ప్రలాపంబులు దోషంబు లేనివాఁ డొక్కఁడైనం గలఁడా యేమి? అంతమాత్రమున వారు పరిత్యాజ్యులా?

గీ. కాఁడ గలఁడంచు మంచి ద్రా ౯ క్షాపలంబు
లెవ్వఁడావలఁ ద్రోయు భ ౯ క్షింపకుండఁ
ద్రిభువ నాధీశువజ్ర వ ౯ ర్ధితకరాబ్జుఁ
గించి దేనమ్మ నెంచి వ ౯ ర్జించు నెవఁడు?

ముని —ఏమి యాతని త్రిలోకాధిపత్యము! వజ్రకీలిత బాహాపరాక్రమము?

ఉ. బాసటగా మురారి నిలు ౯ వంబడి పేరికిఁ బేర్మి దేవ సిం
హాసనమందు నెక్కొనఁగఁ ౯ నాతనిఁ జేసెనుగాక నిక్క మ
వ్వాసవు పేరదేమి? విన ౯ వా? బలి, వృత్ర, జలంధ రాది సం
త్రాసకర ప్రతాపశిఖి ౯ దగ్ధభుజాబల వర్ణనోక్తులన్

అవ్విష్ణు సహాయమే లేకుండిన మన కిప్పటికా యింద్రుఁడే లేక యుండెడివాఁడు గదా!

జేసెద ఇంకఁ దపోదీక్ష నిరాటంకముగాఁ బూనుము

(ఇంద్రుఁడు నిష్క్రమించును)

అర్జు — ఆహా! ధన్యుండనై దుర్వారతప క్లేశంబు లేకుండఁ గనే యింద్ర ప్రసాదంబు సిద్ధించినది ఇంక శంకరుం గూర్చి నిష్కళంకతపం బాచరింతుఁగాక ఆహా! ఏమి యీ మహర్షుల తపోవైభవంబు

ఉ. బొమ్మలవోలె నిల్చి యుగ్రభోగతిఁ బాదము లుంచి
యున్ కసుం
దమ్ములు భానువైపిడి మహోత్తుంగజ సంహవరాహచిత్ర కా
యమ్ముల భీతివీడియు మహోగ్రతపముం బొనరించువీరి పా
దమ్ముల నీడఁ జేసెద సుదారతపంబు మనోర్థసిద్ధికై

(అని యొకచోఁ గూర్చుండును)

(తెర వాలును)

(ఇది ద్వితీయాంకము)

సంపూర్ణము

# భిల్లఫల్గునీయము

## తృతీయాంకము

### ప్రథమ రంగము

(కైలాసము, పార్వతీ పరమేశ్వరులు, ప్రమథులు)

పార్వతి — సకలలోక నియామకా! ప్రాణనాయకా! ఎన్ని దినంబులనుండియో యుద్ధంబులు లేకుండుటచే నాహృదయంబు మహోగ్రసంగ్రామదిదృక్షాకౌతూహలంబందు చున్నయది అట్టి పరిస్థితులేమైన స్వర్గమర్త్యపాతాళంబుల నెందైన తటస్థించునే!

పర — మనోహారీ! శైలరాజకుమారీ! నీయాశయం బూరకయేపోవునే? కొలది కాలములో మధ్యమలోకంబున మహాఘోరసంగ్రామంబు జరుగనున్నది హృదయానందంబుగాఁ గాంతువుగాక

పా — భూలోకంబుననా! ఎవరెవరికి?

పర — దేవీ! హస్తినాపుర రాజ్యలక్ష్మీ భాగధేయులగు పాండవేయ ధార్తరాష్ట్రులకు

పా — అయినను భూలోకయుద్ధములనిన నంతయుత్సాహకరంబుగా నుండవు

పర — ఎందుచేత?

పా — అంతగావెక్కింపఁదగిన వీరాధివీరులుండక పోవుటం బట్టి అందుచేతనేకదా రామరావణ సంగ్రామంబుఁ గూడ నంత తృప్తినీయలేక పోయినది

పర — శాంకరీ! అట్లు నిరసింపకుము ఈ యుద్ధరంగము మాత్రము మహాబీభత్సముగా నుండఁగలదు ఏమందువేని రామరావణులనవలీల గెలువఁజాలు మహారథికులనేకు లిందుభయ పక్షములందున్నారు అందు ఫల్గుని వీరవిహారంబు ముఖ్యముగా, చూడ వలసినదే కాని వర్ణింప దరముగాదు

పా — ఏమీ! ఫల్గునుండంతటి పరాక్రమశాలియా?

పర — ఆహాఁ! చూడవలసినదేకాని చెప్పనలవికాదు

పా — అట్లయిన నాకాతనిఁజూడ వేడుక యగుచున్నది

పర — అయినఁ జూడుము

ఉ. అల్లదె శ్రీషడక్షరమహా జపమూని వినీలవారి ము
క్తోల్లిత కాలిమంబు నిజవీరతప ప్రభవాభఁ దూలఁగా
నుల్లసితార్క కోటివిభవోద్ధతి నద్దరమొప్పఁగా సుధీ
హృల్లలితంబుఁగా నెస గునింతి! మహేంద్రజుఁ
డాతఁడేసుమీ!

పా — ఆహా! ఏమి యీతని తేజస్సు!

ఉ. తాపసవేషియైన బలధైర్యపరాక్రమ చండిమప్రభో
ద్దీప్త బాహుమండలమదే నిజదేహ మసారవీలి మ

మూకాసురా! నీవు మాయాకిరివై పల్గునుఁడు
స్నానార్ధ్యము తెచునపుడలజడి చేయుము ప్రమథు
లారా! మీరు పుళిందులుకండు వేదంబులారా
మీరు సారమేయంబులుకండు పార్వతీ యిఁకలెమ్ము!

(తెర వ్రాలును)

ఇది తృతీయాంకము

(ప్రథమ రంగము)

---

## చతుర్థాంకము

### ద్వితీయ రంగము

(రాలై పార్వతీ పరమేశ్వరులు)

పా — ఏమి యీ వైఖరి!

చ ఘుమఘుమ ఘుంఘుమధ్వనిన శ కుంరితమోదముఁ
గూర్చు నూర్మి కో
త్తమమగు గాంగనిర్ఝరము శ దాఁచితి వెచ్చట? మేలు
మేలు చి
త్తముఁ నలరించు చంద్రకళ శ దాఁచితి వెచ్చట? నా దిభిక్షుస
త్తముఁడవు చెల్లుచౌనను చి శ తంబులుగావివి భిల్లవల్లభా!

పర — దేవీ!

చ ఘుమఘుమ ఘుంఘుమ మధ్వనిన శ కుంరిత మోదముఁ
గూర్చు నూర్మి కో
త్తమమగు గాంగనిర్ఝరముశ దాఁచితినీతనుకాంతిలోనఁ జి

త్రిము సలరించుచం ద్రశేఖరా చితి సీముఖసీమలోన నా
ప్రమద! వధూవిలోలురకు కావ్యములేద యిట్టి
చెయ్దముల్

వా — భావ్యమో? అభావ్యమో కాని ఫల్గునువన ప్రదేశ
మిదే సమీపించినది ఇంక నాద ప్రతివాద హేతువు
గల్పింపుఁడు

పర — మనోహరీ! నేనవియన్నియు మొదటనె చింతించి
యుంటిని విజయుఁ డింకను స్నానార్ధము లేవలేదు
అంతవఱకు మనమీ వనములో విహరింతము రమ్ము

పా — శుహనాభిల్లుఁడవై నందుకు నిజముగాఁ దద్గుణంబులు
కూడ సంభవించుచున్నవా యేమి?

ఉ లోకములాడఁజేయు రసికలోలురమీకును నాటలాడను
త్సేకము గల్గియున్న నగరే మునిలోకము—

పర — ఏలనవ్వు నా
లోకములాడఁ జేయుటకు లోపలిశక్తిఁ ద్వదీయ దివ్యకే
ళీకలనంబులే యొసఁగు కేలిల నెఱింగినఁ జిత్స్వరూపిణీ!

కావున నానందముగా విహరింతము రమ్ము చూడు
మీవృక్షంబు లెంత మనోహరంబుగా నున్నవో!

వా —ఆదాడిమీవృక్షము విశేష ఫలసంభరితమై యెంత యింపుఁగూర్చుచున్నదో చూడుఁడు!

పర —అల్లదె! ఆశాఖాగ్రంబు చూచితే? ఆచిలుక తన ముక్కు నెఱ్ఱదనముతో సామ్యమొందెనని రోషించి దాడిమత్వక్స్ఫోటనంబు సల్పి లోపలిగింజలు నల్లై యుండుటంజూచి కసిదీఱ నమలివేయు చున్నది

వా —కాదు కాదు మనోహరా! ఆచిలుక శుకాఖ్యనలరుటంబట్టి తత్ఫల రక్తిమంబు రజోగుణ సూచకంబు గాన యట్లు మ్రింగివేయుచున్నది

పర —కాదు కాదు మనోహరీ! రక్షకులై త్వగ్విధంబున నున్న కర్ణాది యోధులం గూల్చి రజోగుణ ప్రధానులగు దుర్యోధనాదుల నిట్లే పాండవేయ కీరంబులు కోపారుణితాస్యంబులఁ జీల్చివేయునని యీ శుకంబు సూచింపు చున్నది

వా —సరేకానిండు అదియిశ్వరునకు సమ్మతమేకద

(ఇంత నూర కలకలము) (రా తెరతేచును)

అర్జు —మునీంద్రులారా! వెఱవకుఁడు (అని బాణము వేయును)

(పరమేశ్వరుఁడు బాణము వేయును పందికూలును)

పర —

శా ఔరా! యెవ్వఁడవీవు దుర్మదబలాహంకార!
యీ కాంత తా

వారాహామిషరూపునాత్మ యగుమన్ గ్రాంచ
వేన్నాడుమన్
నేరఁగాని దిని నేఁటివి వక్ర నేత్రపు నీ ఘోర కాం
తారాధిపుని నన్నెఱుంగవటరా! సంభ్రమయాతాపసా!

అర్జు — ఓరి! నిష్కారణ ప్రలాపీ! పులిందా!

ఉ. భీకర దంష్ట్రికాయుగళ భీషణమై పయివచ్చు సూకరా
లోకన భీతులై మునివరుల్ దురపిల్లఁగ దీని నేసితిన్
ప్రాకట మద్విషంగ శర రాజము చే నిది దోషమౌనె? చా
ర్వాక మిదేల? పోమ్ము శబరా! నియమంబున కైన
పావనన్

పర — ఏమేమీ! సూకర సంహారము దోషము గాదనియా పల్కుచుంటివి. ఒకరు వేన్నాడుచు వచ్చుచున్న మృగంబు నింకొకరు వేయుట మృగయా ధర్మ విరోధంబు కాదా?

అర్జు — అకస్మికముగాఁ దపోవనంబుఁ జొచ్చి మునిసంఘమును భయంపడఁజేయ దీని సంహరించితింగాని నీవు వేన్నాడుచున్నాఁడవని కలఁగంటినా యేమి?

పర — ఏమి నీ చమత్కార వచనములు ఔనౌను నీ స్వభావంబు నీ వేషమే తెలుపుచుండ నింక నిన్ను ధర్మాధర్మములడుగనేల?

అర్జు — ధనుర్బాణధారణ దోషంబేనా? నీ వెంచునది పవిత్ర రాజ పుత్త్రుండ నగుట వీనిందాల్చితి దోషమేమి?

ఏక —రాజపుత్త్రుండవా నీవు? అందుచేతనే యీ చమత్కారం వచనములు

సీ. చతురుపాయంబులున్ షాడ్గు । ణ్య సంపదల్
సకల భూపాలసత్క్రియా । సక్తియును మెండు
సర్వజనహింస మా మాన । సముల పంచు
నట్టివిమునేల సృజియించె । నాయజుండు

అర్జు —ఓరోరి భిల్లాధమా! ఏమి నీ యవివేకము

గీ. సకల జనులందు ధర్మవాం । ఛలను నించు
ప్రజల బిడ్డలఁబోలె భా । వమున నెంచు
రాజబుద్ధియె కదర! రా । ష్ట్రంబు పెంచు
నట్టి రాజుల నిందింప । నౌనె చెంచు!

ఏక —ఔనౌను మీ రాజబుద్ధు లెఱుంగనివి కావు ఒక్క కిరాతుఁడొక రాజగురువును గురువుగా భావించి ధనుర్విద్యా పారంగతుఁడు కాఁగా సహింపలేక వాని యంగుష్ఠమును ఛేదింపఁజేసిరి అందుచేతనే

ఉ. రాజులు దుర్మదాంధులని । రాజసతామసయుక్తులై పరో
త్తేజము వోర్వలేని కుమ । తిప్రవరుల్గ నెఱింగి యేను త
ద్రాజులనెల్ల డింభసహి । తంబు వధింపఁగ నుంటి నీవునున్
రాజసుతుండవౌట భళి । రా సమకూరెఁ బ్రతిజ్ఞఁ దీర్పఁగాన్

అర్జు —ఔరా! ఏల వృథాశూరమన్య వచనంబులాడి రాజులపై దండెత్తఁ జూచెదవు

సీ. రాజపుత్త్రులతో సంగరంబు సేయ
భిల్లపాలికి సాధ్యంబె? పృథ్విలోన
అందులోఁ బాండవేయ వీరాధివీర
శేఖరునితోడ రా యని సేయుటవు?

పర — ఓహోహో! పాండవేయుఁడవా నీవు? అట్లైన నింకను మేలె. నీవే కదా మా యేకలవ్యు నంగుష్ఠము చెదింప జేసితివి. బళిబళీ! నిన్నె వెదకుచుండ నీవే యెదురైతివి. అహ్హహా! మీ విక్రమ పౌరుషంబులు నేనెఱుంగనివి కావు

గీ. మీసహోదర పంచా మేయశౌర్య
సంపదకు నాయరణ్యావాసంబె సాక్షి
పౌరుషంబున కింకస బాధలాన
ద్రౌపదీ దేహగళితవస్త్రములె సాక్షి

అర్జు — ఓరీ! మృగప్రాయుండవై వనంబుల సంచరించు నీకు రాజధర్మంబు లేమి యెఱుకరా?

ఉ. శౌర్యము లేక కాదు రిపు సంతతికిన్ భయమంది కాదు ధీ
వర్య నతంబు పౌరుషము వాయుటఁ గాదుర! ధర్మపాలనా
ధుర్యుల మాటనిట్లతివతో వనిఁ గష్టము లోర్వనయ్యె నై
కార్యమసన్ని భౌజులము నయ్యువనేచరలోకనాయకా!

పర — ఏమి నీచమత్కారము. ఏవురొక్క కాంతం బెండ్లియాడుట కూడ ధర్మమే కాఁబోలు మఱియు

గీ డెప్పనెక్కుచుఁ బడితివే ? టికిర ! యన్న
అల్ల దేవుని మ్రొక్కఁగా ? నన్నయట్టు
లఖలలోర్వంగ లేకర ? ణ్యములుసొచ్చి
దబ్బరల్ వల్కుచున్నావు ? ధర్మమనుచ

అర్జు —ఓరీ ! నిష్కారణార్య నిందా మోదీ !

చ ద్రుపదునివీటిలో నలవి ? రోధులనెల్లర నుక్కడంచి యా
త్రిపుర విరోధిలీలవిహ ? రించిన వీరుఁడనేను చాలనే ?
కృపణులఁగౌరవాధమ ల ? నెల్లరనొక్కనిమేషమాత్రమ
ద్విపుల ధనుర్విముక్తశర ? వేధనుజావఁగఁజేయనెక్కటిన్

పర —అంతటివాఁడవగుటనే కాఁబోలు నీ భూతిరుద్రాక్షమాలికలు ఓహో యిప్పుడర్థమయినది నీమాయాతపశ్చర్యాతత్త్వము

అర్జు —ఏమర్థమయినది ?

పర —

గీ రాజ్యముం దోచికొనిమహా ? రణ్యములకు
నంపయుంద్రుత్త సనక వె ? న్నాడి రిపులు
ఆనవాల్పట్టి కూల్తురో ? యనుచునోటు
రాజసము వీడి మాయర్షి ? రాజవైతి

అర్జు —ఓరోరీ ! ఏమి నీయహంకారము తుచ్ఛవనేచరుండ వనికనికరించుకొలఁది విజృంభించుచున్నాఁడవే ఇంక మర్యాద నతిక్రమించి ప్రాణములఁ బోఁగొట్టుకొనకుము

పర - ఏమేమీ! నన్ను సామాన్య శబరునిఁగాఁ దలంచి యిట్లధిక్షేపించుచుంటివే? నీ రాజకుమారత్వము మాత్ర మేదీ?

గీ. అనిమొనం బెంగ రాదమ్మ యంచుఁ బిల్వ
రాజసుతుఁ డెవ్వఁడే శివార్చనయటంచుఁ
దప్పుగానఁ జూచునె నీవు దక్క నిల్లు
చేవలకున్న చేదంచుఁ జెప్పరాదె?

నాకును జిరకాలమునుండి రాజకుమారులతోఁ బోరు నుత్సాహము కలిగియున్నది ఇక్కింతయు నట్టి ఘోరసంగ్రామంబులంజూడ వేడుకపడుచుండు కావున నీకేమాత్రము పౌరుషవిక్రాంతులున్నను నాకీయవకాశము పోకుండు గాక ఇట్లంటినని నీవు పాఱిపోఁజూచితివేని దొల్లింటి దోషంబుల కతన నేనుమాత్రము నిన్ను విడువను

అర్జు - ఓరి శబరా! నీకు విధి చేటితో నాయువు సరియని ప్రాఁతయుండఁగా నామాటలేల విందువు

ఉ. రాజకుమారయోధులపరాక్రమముం దెలియంగ
లేక యీ
యోజ తిరస్కరించినను నోర్చెద నంచు గడంగెదీవు వి
భ్రాజితమద్భుజాధనురపారమహత్త్వముఁ జూతువో వనీ
రాజ! ధరింపుమా వరశరంబులు వింటను మాటలేటికిన్

పర - భేష! ఇప్పుడుగదా నీవు నిజమైన రాచపుట్టువవైతివి

అర్జు - (బాణము వేయును)

పర - (ఖండించును)

అర్జు - (తనలో) ఏమి యీతని దను పాండిత్యము (మరల బాణమువేయును )

పర —(ఖండించి బాణము వేయును)

అర్జు —ఏమి యీతని శరసంధాన చాతుర్యము ఈతని ములుకులు నన్నుఁగూడ బాధించుచున్నవే!

పర —

ఉ ఏమి మహేంద్రపుత్రి! మదిని నెద్దియొచింతన సేయు
చుంటి వం

గ్రామశాలావిధిజ్ఞతలు నీ గాసఁగ వచ్చెనె నారణంబులో
భీముఁడ వౌదునె? నృపులనీ భీరముగోర్వఁగలాఁడనె? బల
స్థేమముచాలునేవిజయ! తెల్పు మొకించుకసంతసం చెదన్

అర్జు —ఓరీ! ఈ పత్కారణ గర్వితా! శబరా! ఇదె చచ్చితి విద్దానిం గాచుకొమ్ము

(అని తూణీ ముగోఁ జెయి పెట్ట బాణము లుండవు)

మ అరరే! అక్షయమైన తూణముల నిన్ లావశ్యకాజిస్థలిన్
శరహీనత్వముసంభవించెబహువాశ్చర్యంబుగా నీతఁడో
వరవిక్రాంతియుతుండుభిల్లుఁడగునాన్బావింప నాకేశుఁడో
హరుఁడో కావలెఁగాక భిల్లునకు శక్యంబానె
నవోన్నర్వఁగా!

బాణక్షీణత కల్గినం గల్గుఁగాక నేనీ మహోద్దండ భుజాదండ చండ గాండీవంబున నీతని శిరంబు ప్రచ్ఛేదంగాక

(అని వ్రేయునదియు మాయమగును) (ఆశ్చర్యమంది) ఓరి ఇంద్రజాలికా! నీవెన్ని మాయలంబన్నినను ఈ ధీరోదాత్తుండు నిన్ను విడువఁడు ఇదే మన్మష్టి మాత్రంబున నీ గుండియ వ్రీల్చెద (అని కొట్టును)

(అంత శంకరుఁడు సాక్షాత్కరించె)

శం — ఫల్గునా! శూరాగ్రేసరా! నీబాహు శౌర్యధైర్య సాహసంబులకు ముదంపడితిని వలయు వరంబు వేఁడుము

అర్జు —(సాశ్చర్య భయంబుగా)

శా దేవా! నిన్ను నెఱుంగ లేక జడతాధీనుండనై ఘోర దు ర్భావంబొందినిరాకరించిశబర ప్రాయుండుగాఁదిట్టితిన్ జేవంగొట్టితి నిట్టినన్నుఁ గరుణా శ్రీమీఱసైరించి వాం ఛావాప్తిన్ ముదమొందఁగామనుపవే యాశ్రిత రక్షామణీ!

శం — ఫల్గునా! ఎఱుంగక సల్పిన దోషంబులు దోషంబులు కాకేరవు మఱియు నీ పరాక్రమంబతిముదంబు చే కూర్చినది ఇంక నీ తప కారణం బెఱింగింపుము

అర్జు — దేవాదిదేవా! నీలగ్రీవా! నా యభీష్టం బెఱింగియు నడిగితివి కాన—

మ గురు శారద్వత సూతజాదిక మహాఘోరారి నిర్మూలమై ధరణి భారవివర్ధనైక గుణ గాంగధారేయ విధ్వంసమై

కావునని శలంబరాజంబున యుక్త ప్రయోగ ప్రవీణుండవై సర్వశత్రులంజయించు విజయనామంబు సార్థకంబు గావించుకొని జగద్విఖ్యాతిఁ బడయుము

(అని పార్వతితోఁగూడ వెడలపోవు)

అర్జు — ఆహా! ఏమినాభాగ్యము! మహేశ్వర ప్రసాదము నాకు లభించినది ఇంకమహేంద్రుఁడిచ్చె నస్త్రంబులం బడయవలయున్నది అయినయు దినకుఁదానై వచ్చి యొసంగెదనని పల్కియున్నాఁడు ఆయన యనుగ్రహ మింకెన్నటికోగదా ఆహా! ఏమియీకాంతి నైక మహాద్రితప ప్రపూతిసుగు నీయింద్ర కీలంబుఁగాంచుటకు పవిత్రకంబుగా మేరు భూధరం బేతెంచుచుండెనా యేమి!

(అని స్థానమునకై వెడలును)

(అంత మాతలి ప్రవేశము)

మాతలి — విజయా! విజయీభవ!

అర్జు — ఎవరుమీరు?

మా — వత్సా! నేనింద్రసారథిని మాతలియనువాఁడ మీ జనకుండు నిన్నుస్వర్గంబునకుఁగొనిరమ్మని యీరథంబునంపె రమ్ము పోవుదము

అర్జు — ఆహా యేమి యీవిమాన సౌభాగ్యము ఈకాంతులే యిప్పుడు ప్రసరించినవి

మా — విజయా!

## విష్కంభము

(రంభా మేనకా శశిరేఖాది దేవకాంతలు)

శశి —ఏమే రంభా! వింతగా సంగారించుకొనుచుంటివేమి? నేఁడెవ్వఁడేని విటసంవాంబు లభించెనాయేమి?

రంభ —నేనింక రంభనుగానే

శశి —మఱెవ్వతవు? మన్మథరాజ్యలక్ష్మివా?

రంభ —అదికాదే నేనిఁక నూర్వశిని ఇంద్రాజ్ఞ మఱచితివా యేమి?

శశి —ఓహో! అర్జునోర్వశీయమునింక భూలోకమునఁ బ్రదర్శింతువన్నమాట

మేనక —అదేమిటే? మీమాటలు క్రొత్తగా వినఁబడుచున్నవి ఇంద్రాజ్ఞయేమి? అర్జునోర్వశీయము భూలోకమునఁ బ్రదర్శించుటేమి?

రంభ —ఈ విషయమునే యెఱుంగవా? పాశుపతాస్త్రంబు వడస ఫల్గునుఁడు నాకమున కరుదెంచినది మొదలు తిరిగి భూలోకమునకుఁజని సహోదరాదులను జేరిన వఱకు జరిగిన యావద్విశేషముల నొకనాటికగా భూలోకమునఁ బ్రదర్శింపనింద్రుఁడాజ్ఞాపించియున్నాఁడు అందూర్వశీపాత్రధరింప నన్నాజ్ఞాపించె తెలిసినదా?

మేనక —ఊర్వశీ పాత్ర నీవేల ధరింపవలయు? ఊర్వశి యేమైనది?

# భిల్లఫల్గునీయము

## చతుర్థాంకము

---

### ప్రథమరంగము

(దేవ ఇంద్రుఁడు బృహస్పతి సోమసుఁడు దిక్పాలుర)

దే — గురువర్యా! మీ యాజ్ఞానుసారంబుగా విజయుంగొనిరా న రథంబుతో మాతలిని బంపితి ఈ సరికి వచ్చు చుండును

బృ — మంచిపని చేసితివి దేవతలకసాధ్యులైన యా నివాత కవచుల నాతనిచే వధింపఁజేసి దేవలోకమునకుఁ బ్రశాంతిఁగూర్చుకొనవలయును

దే — అందుకే దా వాని నిందు రప్పించుట అదిగో! మన రథంబుఁగూడ సవిఘ్నకంబుగావచ్చు గరుత్మంతు నింబోలి యర్జునాధిష్ఠితమై వచ్చుచున్నది

(ఎదురొక్కను నంత నర్జునుఁడు వచ్చును)

(కౌఁగిలించికొని) పుత్త్రా! పార్థా! మహాస్త్రంబులనేకంబు శంకర సాక్షాత్కార సమయంబునందిచ్చెదనని నాఁడు పల్కియు నేఁడొనర్పమి నిన్ను స్వర్గంబునకు రప్పించి యీ సభా మధ్యంబున గౌరవింపఁ దలఁచియేసుమీ!

అర్జు — తండ్రీ! త్రిలోకాధినాథా! మీ రేమి యొనర్చినను నన్నుఁ బవిత్రాతి పవిత్రునిగాఁ జేయుటకే కాక వేఱొండు గల్గునె! కానియెడ యజ్ఞాచరణోపవాసాది విధులఁ గృశించి నశింపకయు వీర విహార క్రమంబున మహాసంగ్రామంబుల దేహంబు విడువకయు, సశరీరిగా నీపరమ పవిత్ర దేవలోకంబుఁ గాంచి మిమ్మెల్లర సేవింపఁగల్గు భాగ్యంబు గల్గునే

దే — కుమారా! ఆదిముని శేఖరుఁడవైన నీకీ నాక ప్రవేశంబొక దొడ్డయే? అదియునుంగాక

గీ. అభవు లోకాధినాథు దేహంబుఁ దాకి
పరమ పుణ్యుఁడవైన నీ కరయ నింక
నాక మననేల సత్యలోకాది సకల
లోకములు చింతిత క్షణాలోకితములె

మఱియు నాకంబెఁ బవిత్రుఁడవైతివి కాన నీకెందెఱుంగరాని విషయంబులు, చూడరాని స్థలములు, అనుభవింపరాని వస్తువులు లేవు వీరె మదీయ సభాలంకార
**రత్నాయమానులు**

మ. గురువర్యుండితఁ డేయఖండధిషణాకూలంకషుం డల్ల దే
వర చింతామణి, వీరె దిక్పతులు, నవ్వారె సుమీయప్సర
స్సరసీజాక్షులు వైజయంత మదిగో సంతానవృక్షంబదే
సురమానీంద్రుఁడు రోమశుండితఁడెనూ శూరైక
చూడామణీ!

అర్జు — మహాత్ములారా! నమస్కారము

దే —రమ్మురమ్ము అనన్య లభ్యంబగు సింహాసనార్ధ భాగంబు నలంకరింపుము

అర్జు —మహాభాగ్యము (కూర్చుండును)

గీ. ద్విజ నమస్కార కలనచే దీవనలును
దేవతా దర్శనంబుచే దివ్యవరము
లారయ నవశ్య సిద్ధంబు లగును గాదె
రెండును లభించె నిచటఁ గోరికల కరుదె?

బృ —శౌనాసీరీ! వరంబులకును దివ్యాస్త్రంబులకును నీకెట్టి లోపంబు లేదు కాని యొక్క విశేషము

అర్జు —ఏమది మహాత్మా!

బృ ఎయ్యనన్యసామాన్యబాహుబలపరీక్ష సేసి శంకరుఁడు పాశుపతాస్త్రంబు నిచ్చెంగాని నీవు మా యిచ్చు నస్త్ర బల పరీక్షఁ గావింపవలయు

అర్జు —అనఁగా

దే — మఱేమియు లేదు కుమారా!

మ. వనజాతాసనుచే వరాళిఁ గొని దేవవ్రాతదుస్సాధ్య దో
ర్ఘన విక్రాంతిమె యున్నివాతకవచాఖ్యానాశరుల్ సర్వస
జ్జనులన్ గట్టిడి సేయుచుండ్రిడి గిరిపక్షచ్ఛేదరూక్షోజ్జ్వలా
శనియున్ నిష్ఫలమయ్యె నయ్యజవరాసాధ్యక్షపాటాళిపై

కావున దేవాధికుండవును దేవేతరుండవును, నమానుష పరాక్రమ శాలివి నగు నీచే నిక్కంబుగా దేవ గణా

రాధ్యులగు రాక్షసులు ప్రస్ఫురింగలరు అయ్యర్థంబులే
గురువర్యులు చమత్కారంబుగా ధ్వనింపఁజేసిరి
అర్జు — తండ్రీ! జంభాంతకా! నన్నీవ్యాజంబున గీర్తి
మంతుని జేయుటకే కాక నిక్కంబుగా మీకా
ప్రముక్కా రక్కసు లనెంత?
బృ — వాక్శాసనీ! జనకాభిలాష మవశ్యాకర్ణనీయము
రోమ — వైదిక ప్రశాంతియు ముఖ్యాచరణీయము
దిక్పా — త్రిలోకకంటకాసురవధయు నాదికరణీయము
అర్జు — మహాత్ములారా! అవశ్యమ్మట్లె యగుఁగాక! మీయా
శీర్వచన ప్రభావంబె నన్ను విజయుం జేయుఁగాక!
దే — ఊర్వశీ
ఊ — (ప్రవేశించి నమస్కరించి) ఏమి సెలవు?
దే — నీవేగి వైజయంత ప్రాసాద నిక్షిప్త కిరీటంబుం గొని
తెమ్ము
ఊ — చిత్తము (పోయి తెచ్చును)
దే — కుమారా! పార్థా! ఈ కిరీటరత్నంబు ధరించిన
వారికి ననంత తేజమును రణోల్లాసంబుఁ గూర్చు
నిదిద్దాని ధరించి యింతటనుండి "కిరీటి" నామంబు
నం దేజరిల్లుము (ధరింపఁ జేయును)
దే — జయము జయము పార్థా!
ఊ — (తనలో) ఆహా! ఏమి యీతని సౌందర్యము!
జయంత నలకూబర నాసత్యులం జయించు చున్నదే.
దే — ఊర్వశీ! నీవింక నేఁగుము

ఊ — చిత్తము (పోవును)

బృ — ఇంక నస్త్రంబులఁ బ్రసాదింపుఁడు

దే — కుమారా! ఇదే ఐంద్రము ప్రత్యర్థి సార్థ విక్రమాగ్నిచ్ఛటా నీరంధ్ర నారి దైంద్రము ఇంక నివ్వి దివ్యాస్త్రంబులు గైకొమ్ము (మంత్రోపదేశ మొనర్చును)

అగ్ని — వాయుజానుజా! ఇది యాగ్నేయము ఇది దుర్దాంతాభియాతివిక్రాంతి కాంతారదహనాంత్యకాలకీలి కీలాకరాళంబు స్వీకరింపుము

వాయువు — కౌంతేయా! ఇది వాయవ్యము ఇది కరాన్ఫాలనప్రయోజాత మారుతాంకూరప్రఘాతూలీకృత పరపరాక్రమంబు చేకొనుము

యముఁడు — ధర్మజానుజా! ఇది దండము వైరివీర భుజాదంష దండకోద్దండ చండము చేపట్టుము

కుబేరుఁడు — మహేశామోదిక సంగ్రామ కళావారీశా! ఇది శాబము వైరివీర భుజాగర్వ నిర్వాపణాక్రియాఘూర్ణహామవుట సురనారీసమాశ్లేష సంభోగాపాదకంబు సంగ్రహింపుము

వరుణుఁడు — పరంతపా! ఇవి వారుణపాశంబులు శత్రుమండలీసమాలోకవోగ్రకీనాశపాశంబులు చేఁదాల్పుము

నైఋతి — ఇదే యాయుము ఖండనక్రియాసురీవ్రతాసురవ్రాతంబు అవధరింపుము

ఈశానుఁడు — కృష్ణప్రియా! ఇది ఐశానము దుర్భరారి పాషాణ విఘట్టన టంకంబు గ్రహింపుము
అర్జు — దిక్పతులారా! ధన్యుండను
బృ — మహేంద్రా!

గీ॥ పౌరహితకాంక్షియై పౌరి శమనకాంక్షి
ఆశరానీకములఁగూల్ప నరుగుచుండె
నాయపడుటయుఁ బడమియుఁ జక్కఁగాదు
ఏమిసేయుదు నను చింత నినుఁడుగ్రుంకె

కాన యిఁక సభ చాలించుట యుక్తము. మఱియు నర్జున వియోగంబున విచారింను పాండవేయుల కీతని శుభ వార్తలంపుటయు నవసరమైయున్నది
దే — గురువర్యా! ఇద్దాని కెవరి నియమించుట యుక్తము కాఁగలదు?
రోమ — దేవేంద్రా! నాకు జిరకాలమునుండియుఁ బాండవేయులంజూడఁగుతూహలంబు గల్గియున్నది కావున నేనే వారికీయుదంతమంతయుం దెల్పి వారి చింతోపశాంతిఁ జేకూర్చెద
దే — అట్లైన నింకేమి కావలయు వారలతో నామాటలుగా నిటు వచింపుఁడు

గీ॥ సకలపాపోప శమనంబు సర్వకాల
శివకరంబు, సుతీర్థ సం సేవనంబె
యగుట పాండవులార! తీర్థానవద్య
సేవనంబునఁ బావన శ్రీఁగనుండు

అర్జునా !

మ అయుతార్కప్రతిభావిభాసురమణీహారోజ్జ్వలద్ద్వారమై
అయసంశిష్ట సురద్రుమప్రసవశయ్యాకల్పితాళిందమై
నయనానంద విచిత్ర చిత్రితకళానల్పీయమై విష్టప
త్రయ పూజ్యంబగునై జయంతమదె పుత్త్రాదానరేఁ
బుచ్చుమా

అర్జు —మహాప్రసాదము

దే —రోమశమునీంద్రా ! ఇప్పుడు పాండవులు కామ్యకవన
మందు విజయాగమనాభిలాషులై యున్నవారు మీ
రేఁగి వారి నుల్లాసపఱుపుఁడు

రోమ —సంసిద్ధముగ నేయుంటి

దే —పార్థా ! ఇఁకరమ్ము

(తెరవ్రాలును)

(ఇది చతుర్థాంక ప్రథమరంగము)

---

# చతుర్థాంకము

## ద్వితీయ రంగము

(అర్జునుఁడు శయనించుచుండ నూర్వశీ ప్రవేశము)

ఊ —(తనలో) ఏమి యీాతని సౌందర్యము ! అనేక సురా
సుర నరేశ్వర మండలీ ప్రార్థ్యమాన సౌందర్యనగు
నన్నే వలపింపఁ జేయుచున్నదే ! ఆహా !

మ యమునాంబు ప్రతిబింబితేందుకళయో! యంక
ప్రబాహుజృంభణ
క్రమాలీకృత సార్వాశాజయవిధియో! కైమర్త్య
కందర్పమో!
ఏవ సుమాంగుని మోముగోము భళిరా! రాజద్వయం
బయ్యెఁ జి
త్రము గాంచంగ నతాంత ప్రబల చేత దంబెన్ననీ
రెంటిలో

ఎన్న నవమోహనాంగుఁ డాదరించునా? సందేహము? మానవమాత్రాలభ్య దేవకాంతారత్నంబు తనకుఁ దానై వలచి వచ్చినఁ దిరస్కరించు షండుండును గల్గునా! అరరే! ఏమిది! దక్షిణ భుజంబదరు చున్నయది నిరాశాసూచకమే! కాదుకాదు దక్షిణభుజస్పందనంబు సంభోగ సూచకంబుగా దైవజ్ఞులు పల్కుచుందురు మేలుమేలు అట్లైననింకేమి కావలయు

గీ. మారకోదండ నిర్ముక్త మార్గణములు
హస్తలీలా సరోజంబు లగునుగాదె
క్రూరరజనీశ చంద్రికాంకూరచయము
లమల దరహాసమగ్నాంశు లవును గాదె?

ఇంక నీసుకుమారు పాదసంవాహనవ్యాజంబున మేల్కొలిపెదం గాక (అని పాదము లొత్తును)

అర్జు —(మేల్కాంచి డిగ్గన మంచము డిగ్గి) తల్లీ! దేవ
కాంతా శిరోమణీ! ఊర్వశీ! నమస్కారము

ఊ —వీరాధివీరా! నవమోహనాకారా! ఒకానొక యబల తరుణవేశ్య సేవాబుద్ధి రాఁ దగురీతి నాదరింపక యిల్లు నమస్కరించు వారెందైనఁగలరే? ఇది శూరకు మారుల లక్షణమే?

అర్జు —తల్లీ! శూరులు యుద్ధరంగంబున శత్రువుల పట్ల తమ శౌర్యంబుఁ జూపవలెఁగాని తల్లులగు మీవంటి వారి యెడనా? సేవాబుద్ధి నంటివి, అట్లనంజెల్లునె ఆది నారాయణు నాభికాండంబునం జన్మించి అసాధారణ కీర్తిశాలియగు మాతాతఁబురూరవుం డెన్నాఁడు పాండవేయులకుఁ బూజ్యురాలవగు నీవా నన్ను సేవించుట? తల్లీ క్షమించి నన్నుఁ బోఁగొమ్ము

ఊ —అయ్యో! నిన్నుఁబోఁగొనుటకేగదా యిల్లొంటరిగా నిశాసమయంబున నేతెంచితిని

అర్జు —అట్లయినఁ దక్షిణం బాజ్ఞాపింపుము

ఊ —విజయా! అదే యాపూర్ణచంద్రుండు నన వేఁడి కిరణముల నాతప్తసువర్ణ శరీరమింకను దహింపఁజేయుచున్నాఁడు వాని దండించి నాశరీరతాపోపశమనంబుఁ గావింపుము

అర్జు —తల్లీ! ఇట్టి మాటలనంబాడియే? సకలలోక ప్రహ్లాదకరుండగు చంద్రుదూషింపఁదగునే? అదియునుంగాక—

8 ఊరుజనిత వాతంబు చిరత్రోద్భవుండు
దానవారికి నౌట సోదరులు గారె
అదియునుంగాక నీ భర్తయైన యా పు
రూరవోన్వయ పతిగాఁడె దూఱఁదగునె?

ఊ —అర్జునా ! ఆ బంధుప్రేమ యతనికే లేక యిట్లేచు చుండ మనకెందుకా కల్పితబాంధవ్యము మఱియు భర్తృవంశకర్తయంటివి అదేటిమాట ? వేశ్యలకొక భర్తగూడ నుందునా ? దేవకాంతలకు వావులు వరుసలును లేవని నీ వెఱుంగవే ?

అర్జు —అయినను నిష్కారణముగా విరహీణులుంబోలెం జంద్రుదు నిందింపనేల ?

ఊ —అర్జునా ! ఇంకను విహారిణులుంబోలెననుచున్నానేమి?

గీ మోహనేందునింగేరు నా ముద్దుమోము
ముకుర కళమీఱు నాదు కపోలకాంతి
వెల్లదినముని విరహిణి విధముజూటి
చెప్పుచుండుటలేదె ? ప్రశ్నింపనేల ?

అర్జు —తల్లీ ! పుత్త్రిప్రేమజూపి నన్నానందింపజేయ వలసిన నీ విట్లసంగత ప్రణయనర్మోక్తులాడం జెల్లునే ? నీవు దేవకాంతవగుట వావి వరుసలు నీకు లేకున్నను

గీ మా కులోద్భవుండైన యతా మహుండునైన
యా పురూరవు నిల్లాల వైతి కాన
మాకు నెట్లైన మాతృ సమానవీవు
తప్పనాడంగ జెల్లునే తల్లి ! నిన్ను

ఊ —అర్జునా ! వావుల వంకంబోయి తప్పించుకొనం జూడకుము అట్లయినను దప్పదుసుమీ యేమందు వేని

సీ॥ సరసిజాతాక్షి నూరు సం । జాతనౌట
పుత్రి నైతినిగాదె యూ । పృథ్వ్యానకును
ఆతఁడిప్పుడు నీకు జా । యాగ్రజన్ముఁ
డౌటచే మేనగోడలి । నైతిఁ బార్థ!

అర్జు — తల్లీ యట్లనంజెల్లునే? ఎన్నఁడో నెన్నునియూరువు నందుఁ బుట్టి ఎదప దేవకాంతా సమ్మిశ్రితవై క్రమంబున మాప్రపితామహుఁ బురూరవునెయ్యంపు టిల్లాలివై మావంగడంబు వెలయించిన నిన్నె రీతి మన్నింపవలెనో యెఱుంగనే? తల్లీ నన్ను దీవించి మఱలి పొమ్ము

ఊ — అర్జునా! ఏలయిట్లు? కొఱగాని వావులు కల్పించి కొని నన్నుఁదిరస్కరింతువు ఇదిగో! ఇటుచూడుము.

సీ॥ రతిని దలఁదన్ను రమణి నీ । రతినిగోరి
తనకు దానుగవచ్చి మం । తనము లాడ
కుచయుగళ కుంభగాఢోప । గూహనాతి
సౌఖ్యరసవార్ధిఁ దేల సం । శయముతగునె?

అర్జు — తల్లీ! నిజంబరయ

సీ॥ రతిఁ దలందన్నఁజాలు వి । భ్రాజితాంగ
రామణీయకము గలుగు । రేమ వయిన
మాతృతుల్యవు గాన త్వ । న్మానితాంగ
రామణీయక మెల్ల న । ర్చ్యంబునాకు

ఊ — అర్జునా! ఏలయిట్లు మాతృతుల్యనని తిరస్కరించెదవు మీవంశ కర్తయగు చంద్రుండు మాతృతుల్యయగు

కనుపట్టించుచున్నాఁడే? అతనికే దోషంబు సంభవిం
చినది?

అజ్జ —తల్లీ! దేవతలకును దేవాంగనలకును జారత్వదోషం
బొకటి యనే దానిని వచించితివి. ఆ చంద్రుండు సమస్త
దేవతా భోజనప్రదాత గావున నాతని కా దోషంబు
లేకపోయి యుండవచ్చును

ఉషా —అజ్జా! ఈ చమత్కారవచనంబులచే నూరక కాలయా
పనము సేయక నీ ప్రియుని బాహాగాఢ పరిరంభసంపు
టిత స్తనకుంభగా నన్నెలుకొమ్ము

అజ్జ —తల్లీ! అసంగత వాక్యకల్పనంబుచే నన్ను విసిగింపక
క్షమించి నిద్రా సౌఖ్యమనుభవింపనిమ్ము

ఉషా —నిద్రా సౌఖ్యమా! ఏమి సౌఖ్యమనుభవించెదవు?

గీ. కామినీమణి లేని చక్కని విలాస
శయన మందిరమద్ది నిస్సంశయముగ
మెఱుఁగులేనట్టి జాబిల్లి మినుమిగాదె
యట్టిశయనంబు శయనమే యపరమా!

అజ్జ —తల్లీ! అంతకంతకు నీ ప్రణయోక్తు లతిక్రమించు
చున్నవే కాని ప్రార్థనా వాక్యంబు లేమియు ఫలిం
పకున్నవి మఱియు నొక్కవిశేషము వినుము

సీ. జూదమున నోడి యకట! మేమైదుగురము
కానన అజ్ఞాత వాసముల్ గడపు లొకటి
జాయతో బ్రహ్మచర్యంబు సల్పు లొకటి
నియమములు రెండు గూర్చుకొంటిమి సవిత్రి!

కావున మానియమప్రకారముగ నీపదునూఁడేండ్లును స్వకాంతా సంగమంబుఁ గూడఁ బరిత్యజించియుంటివి. గాన వృథాప్రయాస బడక మఱలిపొమ్ము.

ఊ —అర్జునా! జూదంబున ధార్తరాష్ట్రులాడు వాక్యంబులు పాలనీయంబులు గావనుటలోకప్రసిద్ధమేగద! అందుకు సాక్షిగాఁ దొలుతఁ గోల్పోయిన రాజ్యాదిభోగంబులు మీరేల మఱచినారా? నన్నేల గాధించెదవు?

ఉ. సూదులకన్నవాఁడియయి ౹ సూటిగచంద్రమయూఖజాలముల్
మేదుర బాధకై పరిణ ౹ మించుచునున్నవి వజ్రమండలా
గ్రోదరధారలై తొరఁగు ౹ చున్నవి మన్మథుపుష్పబాణముల్
ఎదగు కౌఁగిలింతయను ౹ నిస్తులవర్మము నిచ్చికావుమా!

అర్జు —మానవీ శిరోరత్నమా! ఏలయిట్లు వృథామన్మథావస్థలంజెంది యుక్తాయుక్త విచక్షణతగోల్పోయెదవు

గీ. బ్రహ్మచర్యవ్రతంబుచేఁ ౹ బట్టినాఁడ
నన్యకాంతా కుమారతు ౹ ల్యప్రవర్తి
నిన్నిగుణములు విడదిన ౹ యేనుపలుక
మాతవగునీకుఁ దగునె కా ౹ మంబుసూప?

ఊ —అర్జునా! నీవుభూలోకమున నున్నయప్పుడా భూలోకాచారములను ప్రతిజ్ఞలను జెల్లింపవలెనం జెల్లును గాని యేతద్దోషంబులు లేనియీనాగభువనంబున నట్లు ప్రవర్తింప బాధ్యంబు గాదు

అర్జు —ఏమీ! ఏనునాకమునకే గుదెంచినంత నాకౌకసుండనైతినా? వలదు వలదు తల్లీ! నన్ను బాధింపకుము

ఊ —అర్జునా! నీ సంగ సంగ్రామానంద పారవశ్యంబుఁ గూర్ప వచ్చితినె కాని బాధింపఁగాదు నీవెన్ని పుణ్యంబు లొనర్చినను నాసంగమంబు చేకూఱదు ఏం పిరిరా మోఁకా ళొద్దదవు?

ఉ. స్వేదకణ ప్రపూరవివశీకృతమూర్తులు యామమాత్ర సం
ఛాదిత నిద్రలున్ ప్రసవనాయక కేళి కళానభిజ్ఞ లా
సాదిత వార్ధకర్ మనుజసారసగంధులటంచు నెంచితే
త్రైదివకాంతలన్ మదనతంత్రనిమంత్రణచిత్తకాంతలన్

అర్జు —తల్లీ! అద్ది నిజమే కావచ్చును కాని స్వకులాచార ధర్మంబులు వీడుట ధర్మవిరుద్ధము కాన మానవుండనగు నేను దేవకాంతం గూడుట ధర్మదూరమే యగును

ఊ —అర్జునా! ఏమిమాటలివి? ఎందఱెందఱు భూకాంతులు దేవకాంతలం గూడి కీర్తిమంతులుగాలేదు? అదియుఁ గాక!

ఆ. నరవధూటులరతి వీర్య నష్టహేతు
వతుల బలహీన కారణం బగునుగాని
దేవలోక వధూటీ ర తిక్రమంబు
వీర్య సంవృద్ధి కరము సం విత్ప్రదంబు

కావున నీవంటి వీరకులాభరణంబులు మమ్ముఁ దప్పక యాదరింపవలెను

అర్జు — తల్లీ ! అదేమిమాట ?

క. అద్రినెక్కినఁ గానరా ◊ నట్టి జగతి
చెట్టునెక్కినఁ గానఁగా ◊ నెట్టులగును ?
శివకుమారవార్త విక్రమ ◊ శ్రీ మించి
గల్గునె నిర్జరిరతి ◊ కలన లలన !

ఊ — అర్జునా ! రాజులుత్తరోత్తర పదవ్యాప్తులగుటం జేసి యట్లు పల్కిన నను దిరస్కరించుచుంటివి ఇంకనొక్క విషయము గమనించుము

ఉ. స్త్రీలు స్వయంబుగా వలచి ◊ చేరినవారల నాదరింప కు
ద్వేల సుమాకుమారశర ◊ వేదనఁ బాల్పడఁ జేయు నమ్మను
ష్యాళితమంతఁదా మురుత ◊ రాపదలం గొని తెచ్చికొంటకే
మూలముగా నెఱింగియుఁ గ ◊ మోదముతో ననుగార
వింపుమా !

అర్జు — తల్లీ ! ఏదియెట్లైనను నేను ధర్మంబును బ్రతిజ్ఞా నియమంబును దప్పఁజాలను

ఊ — అర్జునా ! ఇప్పుడు నీవు దేవలోకంబున నుండుటంబట్టి దేవతా ధర్మవిరోధముగాఁ బ్రవర్తించిన నదియు దోషమేయగు

సీ. పారిజాతలతాంత ◊ పారకల్పితకాంత
శయ్యానిష్కాంతమై ◊ చనఁగఁ జనునె ?
వైజయంత నిశాంత ◊ వరరత్న కలితాంత
రంబు నిర్మధురమై ◊ క్రాలఁజనునె ?

గ్రహసోల్లసితంబులై పరభృతంబులు పంచమస్వరములు వెలార్ప హాయిగా విహరింప నిచ్ఛగింపుము కోరివచ్చిన కాంతంగూడుట దోషంబు కానేరదు ఇదిగో నీపాదపతితనన్ను మన్నింపుము

అర్జు —(కోపముతో) ఏమేమీ? నేనెన్ని చెప్పినను వినక నాప్రతిజ్ఞాభంగంబుకావింపనే నాహసించుచుంటివే? అందుకై దేవతలు నిన్నిటకంప యుండరుగదా!

చ తరళాయు చంద్రుడున్ గతులు తప్పచరించిన వార్థులేడు న
బ్బురముగ నొక్కటై కలిసి పోయినఁ గల్పక మెండి పోయినన్
ధరణిఁ బృథాత్మజుల్ లవము ధర్మముఁ దప్పరు వేయునేల య
న్యరమణి వంచులో జనని వట్టినినుంగవఁ గూడనేర్తునే!

కాన మాటాడకపొమ్ము నీముఖావలోకనముగూడ పాపశంకం గూర్చుచున్నది

ఊ —ఏమేమీ! క్రూరాత్మా! అనన్యసామాన్యసౌందర్యవతియు నారాయణోరుకాండ సంజాతయు అగస్త్యమహాము నీంద్ర జనయిత్రియు, త్రిదివకాంతా శిరోరత్నంబునగు నేను కోరి నీసంగమం బపేక్షింప షండుడునుంబోలెఁ దిరస్కరించితివి గాన

గీ లోకమెల్లరు నవ్వ నా శీకలోచ
నాకదంబకముల మధ్య నాన వీడి

పండుఁడయ్యెదుగాక, యీశ్వర వరాను
భావగర్వితా! రక్షస్వ బావమాం!

(అని వెడలిపోవును)

(తెర వ్రాలును)

(ఇది చతుర్థాంకము)

(ప్రయ ష)

---

# చతుర్థాంకము

## తృతీయ రంగము

(ఇంద్ర సభ)

ఇం — గురువర్యా! సభాస్తారులారా!

ఉ. నేఁటికి దేవతానగరి చేతృతియన్ వరానంద ముబ్బఁగా
నిటయి దేవ సంచయవినీతమిగింద సమూహా పాషణా
పాటవ మాచు నా హృదయపద్మము మిక్కలి
యొప్పె దుష్టదో
పాట విపాటనక్రమసమర్థఖరాంశుఁడు పార్థరాకచేన్

బృ — తప్పక నీ మనోంబుజాతమట్లె రంజిల్లుఁ గాక

మాతలి — దేవా! ప్రమాదము! అర్జున సంగమాభిలాషిణియై యూర్వశీకాంత రాత్రి వైజయంతమున కేఁగి యాతనిచేఁ దిరస్కరింపఁబడ తత్క్రోధంబునఁ

ఫాల్గుని, నపుంసకుఁడవు కమ్మని శపించినది అదే
యర్జునుఁడు విషాదావనతాననుఁడై యిటు వచ్చు
చున్నవాఁడు

అర్జు —తండ్రీ! నమస్కారము

ఇం —పుత్రా! విచారింపకుము విధి విధానంబు దాఁట
నెవ్వరి తరము గాదు నీ ప్రతిజ్ఞా పాలనేంద్రియ
నిగ్రహమే నిన్నుఁ గాపాడ గలిగె ఊర్వశీశాపోప
హతుండ వైనట్లిప్పుడె వింటిని

గీ. దేవలోక ప్రశాంతికై తెచ్చి పార్థ
శప్తునిగఁ జేసెఁ బాకశాసనుఁడటన్న
నింద నాయుట కోఱకునై నె నొనర్తు
నంచదుపశాంతి దాన నీ కగునుగ్గ

కాన విచారింపకుము మీరు ప్రచ్ఛన్నులరై యుండ
వలెను యజ్ఞాతవాస వత్సరంబున నీ శాపంబనుభావ్యం
బగుఁగాక అప్పుడు నీవు నర్తనోపదేశకుఁడవై రాజపుత్రి
కల నాట్యకళా పారంగతలఁ జేసి కీర్తిఁ గైకొందువు గాక

అర్జు —తండ్రీ! ధన్యుండను ఇంకనిదే దుష్టనివాతకవచ
రాక్షస వధార్థంబరిగెద మార్గదర్శకుల నాయత్త
పఱుపుఁడు

ఇం —మాతలి! రథంబు సిద్ధపఱుపుము బహు జాగరూక
తతో సారథ్యంబు చేయవలయును

మా —చిత్తము రథము సిద్ధముగనే యున్నది

ఇం —కుమారా! పార్థా!

శా॥ క్రూరాత్ముల్ మదయుక్తు లాహవ కళా సంకూలంక
షుల్ విద్వేష
న్మారుల్ ధర్మ విదూరవర్తులు మహా మాయాసమేత
క్రియుల్
పారావారనిశాంతలాదిలిజులేవందృక్కాలాటన్ భుజా
సారంబున్ మలియుం గదిర్చి రిపునా శక్రీడ
వర్తింపుమా!

అర్జు —తండ్రీ! అట్లే యొనర్చెద

బృహ —వీరాధివీరా! పృథాకుమారా!

ఉ॥ శంభువరప్రసాదుఁడవు సంగర రంగ భయంకరాశు గో
జ్జృంభుఁడవక్షయ ప్రదరసద్ధనిషంగుఁడ వట్టి నీరణా
రంభమ శుంభదాసురపరాక్రమవార్ధికి బాడబాగ్నిసం
రంభము గాఁగఁ బార్థ! సుక రంబుగఁ గొమ్ము!
జయేందిరా మణిన్

ఇంక వార్ధి నిగూఢులగు నానివాతకవచ దైతేయుల
పరాక్రమ లక్ష్మియు వార్ధిం గలియుఁగాక

అర్జు —మహాత్ములారా! మీయాశీర్వచనంబు లమోఘం
బులు

గీ నాపరాక్రమ పావక । వ్యాపృతికిని
మిా వరాశిర్మరుత్సుము । నిర్మలనంబు
తోడు సూపవిరోధి బం । ధురబలంబు
శలభ సంకాశమైమూడి । సమయుఁగాక

(అని నడువఁదెరవ్రాలును)

(ఇది చతుర్థాంకము)

సంపూర్ణము



# భిల్లఫల్గునీయము

## పంచమాంకము



(కామ్యక వనము ద్రౌపదీ ధర్మజ, భీమ యములు)

ధర్మ — మనోహరీ! సహోదరులారా! పాశుపతాస్త్రంబు వడయ విజయుఁడేఁగి నేఁటికి రమారమి యేఁడు వత్సరంబులు కావచ్చినది ఇంతవఱకు వాతని క్షేమసమాచారంబు లేమియుఁ దెలియలేదు ఏమి కర్తవ్యము?

ద్రౌ — మనోహరా! ఆ పాండవ మధ్యముఁడు లేని యీ కుటీర మెంతయుఁ దరళంబులేని హారంబువలె విన్నంబోయినది ఆతఁడింకను రాకున్కి కతంబేమియో కదా!

భీమ — అన్నయ్యా! నిష్కారణముగాఁ బార్థుని తప క్లేశంబు నకుఁ బాల్పడఁజేసితిమి వేలకొలఁది వత్సరములు తపించి తపించి మహర్షులే పడయలేని శంకర ప్రసాదము పార్థున కంతలోనన కల్గునే? శత్రువిజయంబునకా పాశుపతంబే కావలయునే?

సీ॥ పరిపంథి గంధసింధుర కదంబక భయం
కర సింహవేషమా కర్కశాసి

భీమాభిసంపాత ఽ భీకారి ముఖర క్త
పాన సమున్మాదన ఽ భాసురగద
ప్రత్యర్థిమండల ఽ ప్రథమాంగ కర్తనో
ద్దండ మాబీభత్సు ఽ గాండీవంబు
శలభీకృతారాతి ఽ సైన్యసంఘాతంబు
నకులవాహిక మహో ఽ నైపుణంబు
ఽ అన్య విక్రాంతహస్త తం ఽ తన్యమాన
ఘోర కోదండ ఖండన ఽ క్రూరకార్య
చణము సహదేవు పాణి దు ఽ స్సహాశరాస
మిట్టి వీరులమేల శం ఽ కింపననికి

ధర్మ —భీమసేనా ! ఏల వృథాయహంకరించెదవు మహాస్త్ర లాభంబున మనకేమియు నష్టంబు లేదుగదా ! అరణ్యవాసంబు వృథపుచ్చనేలయని శ్రీకృష్ణుఁడిద్దానికై తన ముద్దుమఱందింబుచ్చెఁ గాన తదాగమనాభిలాషులై భగవత్ప్రార్థనంబు సల్పుఁడు

నకు — ఆర్యా ధర్మజా ! ఇప్పటికే యేఁడేండ్లు గడచి పోయినవి శంకర ప్రసాదంబింక నెన్ని యేండ్లకుం గల్గునో యెఱుంగరాదు మిగిలిన యాఱేండ్లలోనైనఁ దన్మనోరథసిద్ధియు సోదరాలోకనోల్లాసంబు మనకునుం గల్గునే ?

సహ —తప్పక సిద్ధింపఁగలవు లేకున్న భూతభవిష్యద్వేదియగు శ్రీకృష్ణుఁడేల యిప్పనికై తనముద్దుమఱందిం గూర్చును ?

ధర్మ —నిజము నిజము సహదేవా! నీమాటవృథగాదు తప్పక యచిరకాలములో వార్థుఁడు సాధితార్థుఁడై రాఁగలఁడు

ద్రౌ —అట్టి యాశలతోనే యిన్ని నాళ్ళుగడపితిమి కాని తదాగమనంబు మాత్రము సిద్ధించుటలేదు

ధర్మ —కాంతా! అనుజన్ములారా! నేఁడెద్దియోయొకశుభ మవశ్యము కల్గవలయు ఏకదీక్షగా నాదక్షిణాక్షి యదరుచున్నది

భీమ —మనకంకను శుభములా? ఎందుండి యూడిపడును? అజ్ఞాతవాసవత్సర మొకటి ప్రచ్ఛన్నముగాఁగడచినఁ గదా?

ధర్మ —తమ్ముఁడా! భీమసేనా! దైవానుగ్రహముచే నదియు నట్లే గడవఁగలదు మనమిప్పుడు కష్టదశలోనున్నంత మాత్ర శుభములు కల్గవనియేనానీనమ్మకము గాఢాంధకారములో బాధపడు బాటసారికి మిన్కుమిన్కు-మని నక్షత్రములప్పుడప్పుడు తోడుసూపవే? ఇంతటి పరాక్రమవంతులమయ్యు నీకష్టంబు లనుభవింపనేల యన్న —

గీ చండతరభాను కాండబా ॥ స్వాంతుఁడగుచుఁ
బరదురాలోకుఁడై వెల్గు ॥ భాస్కరుండె
రాహుదంష్ట్రవిలగ్నుఁడు ॥ ర్దశఁగనండె?
మనమనఁగ నెంత? కాలక్ర ॥ మంబునందు

కాన యీకాననావాస చింతంబాయుము మద్దక్షి
ణాక్షి స్పందనఫలితంబుగా ముఖ్యముగా విజయాగమనంబో
లేక తద్వార్తయో తెలియఁగలదు కానఁదన్నిరీక్షకులై
యెదురు మాడుఁడు

ద్రౌ —నాథా! మీనిశ్చయింబు ఫలించుఁగాక! తద్దర్శన
భాగ్యంబు మాకొదవుఁగాక

భీమ —ఏమి మీయాశయంబులు తెచ్చికోలుముదంబులు!

సహ —సోదరా! వృకోదరా! అట్లునిరాశఁ జెందఁదగునే
ధర్మపుత్రుని వాక్యంబులెన్నఁడైన నిరర్థకంబులగునే!
తప్పకనేఁడెద్దియో శుభంబుగల్గు

(అంతరోమశమునీంద్రునిప్రవేశము)

ధర్మ —మహాత్మా! వందనములు దయసేయుఁడు

రోమ —శుభమస్తు పాండవులారా! అందఱకును సేమమే? ఏను
రోమశుండనువాఁడ ఇంద్రప్రేషితుండనై వాసవి
వార్తలు మీ కెఱింగింప నేతెంచితి

ధర్మ —మీవంటి మహాత్ములదయచే నిప్పటికి సుఖులమై
యుంటిమి అర్జును శుభవార్తకే యెదురుసూచు
చుంటిమి పరోపకారపారీణులగు మీదయచే నదియు
సిద్ధించినది

రోమ —ధర్మజా! సజ్జనస్తుత్యచరిత్రుండవగు నీకీవినయంబు
సహజంబ ఇప్పుడు పార్థుఁడు పురుహూతసమాహూ
తుఁడై నాకంబున సుఖంబున్నవాఁడు కొలఁది
దినములలో మిమ్ముఁగలియరాఁగలఁడు

భీమ —పార్థుఁడు నాకమేఁగెనా? శంకరునిచేఁ బాశుపతంబు
వడయ దపోదీక్ష బూనలేదా?

రోమ —భీమసేనా! పాశుపతంబు వడసియే నాకమున
కరిగెంపె

క॥ పరతపఃసనభక్తి పా । వనము వలనఁ
బృగసుల బాహాబలోత్సేక । విధము కలనఁ
బార్థుఁ డార్జవ మెప్పించి పడసినాఁడు
దివ్యపాశుపతాస్త్రంబు । పాండవేయ!

ధర్మ —ఆహా! పరమసంతోషము

నకు —తదుపరి యింద్రలోకమే గనేల?

రోమ —అప్పుడు దేవేంద్రుఁడును సకలదేవతా ప్రేరితుఁడై
పార్థుం దోడ్కొనిరా మాతలి నరదంబు నిచ్చిపంచె
అర్జునుండును దద్రథాధిష్ఠితుండై

సీ॥ కాద్రవేయస్వామి । కాంతశయ్యాసన
మధుకైటభారి నా । మహిమ నెసఁగి
యైరావతానేక । వారూథ దేవతా
సార్వభౌముండు నా । సరణిఁగులికె
జాతరూప శిలో । చ్చ్రయాతతాధిత్యక
కలితవారిదమునాఁ । జెలువు మిగిలి
గంగానదీ వీచి । కా డోలికాలోల
కాదంబవరము నాఁ । గాంతిఁదనరి

గీ॥ నిఖిల నాకౌక సానీక । నేత్ర నివహ
పర్వదాయకమూర్తియై । వచ్చి విబుల

సురవిమానాధిరాజము గ్రచ్చెరువుదోఁప
డిగియెనంచదన పుష్పవాటికలనడుమ

ధర్మ — తదుపరి?

రోమ — అట్లు దిగి పారిజాతలతాంత వాసనాసంభరితమారుతాంకూరము లల్లనల్లనవచ్చి మనోజ్ఞకేశపాశంబులూప దేవకాంతాకదంబ స్తవనీయ కటాక్షేక్షణంబు లొక్కమ్మడి ముఖమండలము నాశ్రయింప లతావితానగళితపుష్పంబులుమంజుశరమార్గంబుఁగూర్ప మెల్లమెల్ల నడచుచు రాజమార్గంబుచే నప్పుడు సౌధాంతరజాలకంబులచెంత నచ్చర కోలంబు కొమ్మలెల్ల బొమ్మలవోలె నిల్చి తదీయ సౌందర్యామృతపానంబు సేయందొడంగిరంత నొక బాల —

ఉ. తానముచేసవచ్చిపరిధానముఁ గట్టుచుజాలకంబునన్
వాని వరానుసంగని యవారిత తత్ప్రతి చిత్తవిధి సం
ధానితమైనఁజక్కనిఁక దాఁటఁ గలాదెయటంచు బేలయై
పీనకుచద్వయంబు బిగఁ బెట్టియె తాలిచెఁ
గంచుకం బొగిన్

ఇవ్విధంబున బాలాజన హేలాకటాక్ష జాలానందదాయియై పోయి సుధర్మం బ్రవేశించి సహస్రాక్షుచే గౌరవింపఁబడి తదర్ధాసనంబలంకరించె అప్పుడు సకలదిక్పాలురు తమతమ దివ్యాస్త్రంబులొసంగిరి ఇంద్రుఁడు కిరీటంబును, దేవతలు "దేవదత్తం" బను నొకశంఖంబును బ్రసాదించిరి

ద్రౌ —అట్లయిన నింకనాతనిఁ బంప కుండుటకు హేతువేమి?

రోమ —మానినీ! అదియుం దెల్పుచున్నాఁడ, వినుము నివాతకవచులనెడి దుష్టదైతేయులు సురలకసాధ్యులై త్రిలోకహింసఁగావించు చున్నారు కాన తద్వధార్థమై దేవతలు ప్రార్థింపఁ బార్థుఁడం దాఁగె సుఖముగా నింకఁ గొలఁది దినములకో రాఁగలఁడు మఱియు నింద్రుఁడు తన మాటలుగానిట్లు పల్కుమనియె వినుఁడు

గీ సకల పాపోప శమనంబు సర్వకాల
శివకరముఁ బుణ్య తీర్థసం సేవనంబె
యాట పాండవులార! తీ ర్థాన వద్య
సేవనంబున పావన శ్రీఁగనుండు

కావున తత్సేవనంబున కుపక్రమింపుఁడు

ధర్మ —

ఉ అంబుజగర్భ తేజ! సుజనావళిచేవినియుంటి మున్ను, తీ
ర్థంబులసేవ సర్వశుభ దంబని కాని తదీయ సన్మహా
త్త్వంబు లెఱుంగ నైతి విశ దంబుగఁ దెల్పవె తన్మహాత్త్వసా
రంబులునిన్నువేఁడెదనిరంతరమున్ మునిలోకపావనా!

రోమ —ధర్మపుత్త్రా! దానికై యింతగా నడుగనేల? సావధానంబుగా వినుము

సీ యాగాదు లొనరింప నందునట్టి ఫలంబు
చేకూఱుఁ దీర్థసం సేవనమున

భూస్వర్ణ గోదానములఁ గల్గెడి ఫలంబు
చేకూఱుఁ దీర్థసంసేవనమున
అనయోపవాస దేవార్చాదిక ఫలంబు
చేకూఱుఁ దీర్థసంసేవనమున
ఆర్తావన క్రియా ప్రాప్త దివ్యఫలంబు
చేకూఱుఁ దీర్థసంసేవనమున
గీ. అశ్వమేధ వితాన సహస్రకరణ
పుణ్య పరిపాక మబ్బును గణ్య తీర్థ
సేవనంబున నిజము ధర్మావధీరి
తోక్ష వరులార ! పాండవేయోత్తములార !

కావునఁ దత్తత్తీర్థ మాహాత్మ్యములు తత్తత్తీర్థంబుల కడనే వచించెద నడువుఁడు

ధర్మ — చిత్తము మహాత్మా ! అట్లే పోవుదము
(లేచి నడతురు)

రోమ — పాండవులార ! ఇదే పుష్కర తీర్థము ముప్పది మూఁడుకోట్ల దేవతలతో బ్రహ్మనిరంతర మిందుండి యిందాడినవారి కఖిలైశ్వర్యములుఁ గూర్చుచుండు మఱియు నశ్వమేధ ఫలంబు చేకూఱుఁగాన దీనతీర్థ మాడి తరింపుఁడు

ధర్మ — ధన్యులము మహాత్మా ! ధన్యులము

రోమ — ఇది శాకరస తీర్థంబు దీనియుత్పత్తిక్రమంబతి విచిత్రము తొల్లి శౌనకుండను మహర్షి యజ్ఞార్థము దర్భలనేరుచుండ దత్కుశాభి ఘాతంబున వ్రేలు

వచ్చి శాకరసంబుద్భవించి పాఱఁదొడంగినది దాన నాతండు విస్మితుఁడై యానందోద్రేకమున నాట్య మాడుచుండె నద్ది దుస్సహంబగుటచే దేవతలు ప్రార్థింప శంకరుండు మాయామునియై వానికడ కేఁగి యేల యిట్లాడుచుంటివని ప్రశ్నించి వానిచేఁ దత్ప్రకారంబువిని యిది యొకవిచిత్రమా! ఇటు చూడుమని తన వ్రేలితో నంగుష్ఠ వ్రేలింగొట్ట నందు భూతి జనించినది దాని కమ్మాని లజ్జించి మహాత్మా! నీవు శంకరుఁడవుగాక యింకొకరుండవుగా నేరవు నన్ను సైరింపుమని వేఁడికొనియె శంకరుఁడు ననుగ్రహించి వరంబు వేఁడుమనుటయు నతండు

చ. వరశివరం బొసంగ సమస్తకట్టితి వేని యుమామహేశ! మ
త్కరప్రసూతమైన శాకరసస్థానమహోత్తమ తీర్థరాజమై
నిరతము సేవకాళి కిఁక నీతిసుఖంబు లొసంగఁగాత సు
స్థిరముగ నంబతోడ నివసింతువుగాత సతంబు నీవిటన్

అనికోరుటయు శంకరుండు నట్లనుగ్రహించెఁగాన యిది తీర్థరాజంబు నాఁజెల్లు దీని సేవించి తరింపుఁడు

రోమ — ఇది రామహ్రదంబు

ఉ. దారుణమౌ కుఠార ఘనధారల రాజులఁ జంపి తత్ప్రతీ
కారుణధారలన్ బరశురామ హస్తుఁడు భార్గవుఁడీ మడుంగులం
గూరిచి పార్వతీశ్వరుని సుందరదయామతిఁ దీర్థరాజ సం
స్కారమునందఁ జేసెని విశ్వాత్మజనాఘనివారకౌఘముల్

ఇందుఁ బితృ తర్పణంబుఁ గావించువారికిఁ బితృ దేవ

తలు నాఞాత్కరించి యభీష్టవరంబు లొసంగుదురు కాన
దీని సేవింపుడు

ద్రౌ —ఏమి యీ కాంతులు! క్రమక్రమంబున మన వైపు
నకే వచ్చుచున్నవి దేవలోకవిమానమాయేమి?

రోమ —మానినిమణి! పాండవులార! నిజంబద్ది దేవవిమా
నమె విజయుఁడు రాబోవు ఆతనితోఁ గూడ నిఁదాడి
తెంతముగాక

అర్జు —(వచ్చి) మహాత్ములార! నమస్కారములు

రోమ —దేవకార్యంబు నిర్వర్తించితే?

అర్జు —చిత్తము మహాత్మా!

ధర్మ —ఇన్నాళ్లు సుఖంబెకిది

అర్జు —చిత్తము

భీమ —మునిం ద్రుడు లెతెంచిన ఎమ్మట నెమి జరిగినది?

అర్జు —నేనారాత్రి వైజయంతమునశయనింప నూర్వశినన్నుఁ
గామించి తిరస్కృతయై నపుంసకుఁడవుకమ్మని శపించి
నది దాని నింద్రుండు డజ్ఞాతవాసోపయోగ్యముగా
నపచరించె తదుపరి రాక్షస వధార్థంబరిగితి వారికినాకు
మహాసంగ్రామంబు జరిగినది అందువారునిలువలేక
మాయాపాటవంబుననంధకారంబుఁగల్పించిరి నేనును

శా కన్నుల్ గోకనదాప్త శోణతఁగనగ్నాలాంత వేళాసము
త్పన్నాభ్రధ్వనిఘోరెఁగంభరవమొసప్పన్ విస్ఫులింగచ్ఛటా
చ్ఛన్నాభ్రంబుగఁబూని పాశుపత మస్త్రంబుం
ప్రయోగించియా
మన్నీలందునుమాడి దేవగణ సన్మాన్యుండనై వచ్చితిన్

ధర్మ —ఆహా ! నీనాహాసంబతి లోకము ఇంక రమ్మా రామ
ప్రాదంఎల మునింగి ఎత్తృతర్పణంబుం గావింతము
(అందఱు దోసలిపట్టి ధ్యానింతురు)

(పాండురాజు)

పాండు —కుమారులారా ! వంశపావనులారా ! మీ యత్మ
భక్తిచే నేను మహోత్తమగతి నందితిని మీవంటి
పుత్రులు గల్గినంగదా ఎతలకుత్తమగతులు, కుల
సముద్ధరణము ఘటిల్లుట

అందఱు —జయము జయము మహారాజా !

పాండు —కుమారులారా !

(భరతవాక్యము)

గీ కలుగుంగావుత సకలసౌఖ్యములు మీకు
ధరణి వరియించుంగాక సంతతము మిమ్ము
శత్రుని శ్శేషమగుంగాత సత్వరమ్ము
భారతావని కీర్తి సాంద్రపారుంగాత !

(తెరద్రాలును)

ఇది పంచమాంకము

గద్య —ఇది శ్రీమత్కామాక్షీ కృపాకటాక్ష లబ్ధ సహజ
కవితావిలాస కట్టి భీమలింగాచారి నామధేయ ప్రణీ
తంబైన భిల్లఫల్గునీయంబను నాటకంబు సర్వంబు
నిర్వర్తితము

(మిత్రార్పణమస్తు)

